

మహాబలిపురంలోని లైట్ హౌస్ (ఫొటో : యం. గురురాజ)

# ఉత్తరాలు

## పైసలు...నయాపైసలు

జూన్ మొదటి తేదీనుండి నయాపైసలు పోయి ఉట్టి పైసలుమాత్రమే, గవర్నమెంటువారు అమలులో పెట్టేరు. అటువంటప్పుడు, ఇంకా మీరు మీ పత్రిక ఖరీదు 30 న. పై. అనడము ఏమీ బాగోలేదు. కనుక ఇకమీదట నుంచి న.పై. మానివేసి పైసలుగా ముద్రించ గోర్తాను.

వంకాయల విశ్వనాథం (విశాఖపట్నం)

*పాఠకుని సూచనకు కృతజ్ఞులము.

## ముఖచిత్రం

నూతన వటి కొంచెం ఆకర్షణీయంగానే ఉన్నా, ఒక్క విషయం మీకు వ్రాయదలచుకున్నాను. "సాక్షి" 5వ సంపుటంలో పానుగంటి లక్ష్మీ నరసింహంగారు చిత్రలేఖనం గూర్చి ఏమన్నదీ మీరు వీలుచూచుకొని ఒక్కసారి తప్పక చదవాలి!

విజయచంద్ర (కాకినాడ)

## రామచరితమానస్

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో రామచరిత్ర మానస్ ఒక ప్రత్యేక ఆకర్షణ కలిగించుచున్నది. సాధారణముగా తెలుగు తెలిసినవారికి బాగుగా అర్థమగునట్లు హిందీనుంచి తెలుగునకు తర్జుమా చేసి వ్రాసిన ముంగర శంకరరాజు గారికి ఆంధ్ర పత్రిక సచిత్రవారపత్రిక ద్వారా నా హృదయ పూర్వక అభినందనములు తెలుపుకొనుచున్నాను.

పొరుసర్ల సత్యం (నెల్లూరు)

## గంగాధరరావు సమాధానం

తమ స్టూడియోపై వచ్చిన ఆరోపణలకు సమాధానమిస్తూ శ్రీ సారథీ స్టూడియో నిర్వాహకులు శ్రీ సి. వి. వి. ఆర్. ప్రసాద్‌గారు ఇటీవల వివిధ పత్రికలలో ఒక ప్రకటన చేశారు. అది చూడగానే నేను చాలా విస్మయం చెందాను. వారు చేసిన ప్రకటనలో సత్యదూరమైన విషయాలు నా గురించి ఉండడంవల్ల యదార్థాన్ని పాఠకుల ముందు పెడుతున్నాను.

మొట్టమొదట 1958లో మన ప్రియతమమైన ఆంధ్ర రాజధానిలో ఏకైక చలనచిత్ర నిర్మాణశాలను నిర్మిస్తున్నప్పుడు ఉన్నతాశయాలతో ఉత్తమ లక్ష్యాలతో మన తెలుగు గడ్డమీద మనదీ అంటూ ఒక చలనచిత్ర రంగం నిర్మించగలమనే అచంచల విశ్వాసంతో కలసికట్టుగా కాపురాలను తరలించుకొని వెళ్లిన తొలిజట్టులో నేనూ ఉన్నాను. ఆంధ్ర రాజధానిలో నిర్మించిన మొట్టమొదటి సంపూర్ణ చలనచిత్రం నేను నిర్మించినదే అయినందుకు అదెంతో అదృష్టంగా భావించుకుంటున్నాను.

ఆదిలో ఏవిధమైన సదుపాయాలు లేని హైదరాబాదులో నేడు చలనచిత్ర పరిశ్రమ ఇంత సౌందర్యవంతంగా సాగుతూ ఉంటే అందుకు ఉడతాభక్తిగా కనీసం రేణువులనైనా నేను సైతం సమర్పించాననే సత్యాన్ని నా స్నేహితులు సి.వి.వి.ఆర్ ప్రసాద్ గారు కాదనలేరు.

స్వయంకృషితో ఆంధ్ర రాజధానిలో ఆంధ్ర చిత్ర పరిశ్రమకు పునాదులు వేయాలనే సంకల్పం తప్ప నిర్మించిన ప్రతి చిత్రానికి యాభైవేల రూపాయలు ప్రజాధనం ప్రభుత్వం ద్వారా దక్షిణ పుచ్చుకోవాలనే స్వార్థం హైదరాబాద్‌లో ఏడు చిత్రాలు నిర్మించిన శ్రీ రామకృష్ణ ప్రసాద్ గారికిగానీ మూడు చిత్రాలు నిర్మించిన నాకుగాని నాలుగు సంవత్సరాలు స్టూడియో నిర్వహించిన శ్రీ సి.వి.వి.ఆర్ ప్రసాద్‌గారికిగాని రాలేదన్న సంగతి అందరికీ తెలిసిన సంగతే.

అన్నిటికన్నా ముఖ్యంగా హైదరాబాద్ తరలి వెళ్లిన పిమ్మట ఆంధ్ర రాజధాని పేరే సగర్వంగా నా కంపెనీకి "హైదరాబాద్ మూవీస్" అని పెట్టుకుని చలనచిత్రాలు నిర్మించాను. అటువంటి నేను నా "వ్యాపార అవసరాలు నిమిత్తం" హైదరాబాద్ విడిచి వెళ్లానని నీలాపనింద వెయ్యడం చాలా శోచనీయం. పైగా (అన్ని పత్రికలలో కాకపోయినా కొన్ని పత్రికలలో) నేను వారికి డబ్బుబాకీ పడి ఉండడం కూడా నా హైదరాబాద్ నిష్క్రమణకి ఒక కారణమై ఉండవచ్చునని ధ్వనించడం అసమంజసం. అవన్నీ అలాగ ఉంచి ఆంధ్ర రాజధానిలో కట్టిన ఏకైక స్టూడియోకే ప్రతిభను అంకితం చేసిన తొలిజట్టులో ఉన్న నేను స్టూడియో క్లిష్ట దశలో ఉన్నప్పుడు దానిని నిలబెట్టడానికి సహకరించలేదని అభాండం వేయడం హృదయ విదారకం.

శ్రీ సి.వి.వి.ఆర్ ప్రసాద్‌గారు సారథీ స్టూడియో 1962 లో చాలా క్లిష్టదశలో ఉన్నదన్నారు కాని నిజానికి 1961 లోనే అత్యంత క్లిష్టదశలో ఉండేదని ఆయన నిరాకరించలేరు. ఎలాగైనా స్టూడియోని నిలబెట్టాలని ఆయనా, నేనూ, ఇతర స్నేహితులు బాధపడి అహర్నిశలూ చర్చించాం. [తక్షణం ఏదో ఒక చిత్రాన్ని నేను మొదలుపెట్టకపోతే స్టూడియో తలుపులు మూతపడే దారుణమైన పరిస్థితులు ఏర్పడతాయని శ్రీసి.వి.వి.ఆర్ ప్రసాద్‌గారు చెప్పారు.] ఆంధ్ర రాజధానిలోని స్టూడియోని నమ్ముకుని కుటుంబాలతో మదరాసు విడిచి వచ్చిన సాంకేతిక నిపుణుల కుటుంబాలన్నీ చాలా కడగండ్ల పాలయ్యే స్థితి వచ్చింది. అటువంటప్పుడు అప్పటికప్పుడు ఎన్ని ఆర్థికమైన చిక్కులు నాకున్నా సరే స్టూడియోని నిలబెట్టడానికే నా మూడవ చిత్రం "పెళ్లికాని పిల్లలు" వెంటనే ప్రారంభించాను. నేను సహకరించినందువల్లనే స్టూడియో పనివాళ్లకు యజమానులు ఇచ్చిన నోటీసులను ఉపసంహరించుకున్నారు.

ఆ తరువాత శ్రీ జగ్గయ్యగారు వారి చిత్రాన్ని హైదరాబాద్‌లో నిర్మించదలచినప్పుడు వారు కోరిన కాల్‌షీట్లను అంతకుముందే నాచిత్రం షూటింగుకు నిర్ణయించి ఉంచుకొనడంవలన స్టూడియోవారు ఇవ్వలేకపోతే నేను నిర్వాహకులతో సంప్రదించి నా షూటింగు మానుకుని స్టూడియోవారి కొత్త ఖాతాదారులకు కావలసిన సౌకర్యాలు ఏర్పాటుచేశాను. ఇది స్టూడియో అభివృద్ధిచెందాలని చేసినది కాదా?

ఇటువంటి యదార్థ విషయాలను మరుగుపరచి "వ్యాపార అవసరాలు" ("బాకీలు") అనే సంగతులు తెచ్చి ప్రప్రథమంగా చిత్ర నిర్మాణాన్ని హైదరాబాదులో ప్రారంభించి, వరుసగా మూడు చిత్రాలు తీసి వారితో అన్ని రకాలుగా సహకరించిన నాకు స్టూడియోలో తావులేకుండా వారే చేశారన్న సత్యాన్ని కప్పిపుచ్చాలనుకుంటున్నారు.

వ్యాపారం అన్న తరువాత ఇచ్చిపుచ్చుకోడాలు, బాకీలు, సర్దుబాటులూ అన్నీ ఉంటాయి. నేను సారథీ స్టూడియో వారికి ఏ సంవత్సరం, ఏ పరిస్థితులలో బాకీపడినది, ఆ బాకీకి ఏ హక్కులన్నీ వ్రాయించుకుని వారు సర్దుబాటు చేసుకున్నదీకూడా శ్రీ ప్రసాద్‌గారు పత్రికలలో ప్రకటించితే చాలా సంతోషించేవాడిని. 1960 లో నేను నా "జల్సారాయుడు" చిత్రాన్ని నిర్మించాను. దానికిగాను వారికి బాకీ పడ్డాను. 1961 లో ఆ స్టూడియోలోనే నేను నా తదుపరి చిత్రం "పెళ్లికాని పిల్లలు" నిర్మించాను. నేను బాకీ చెల్లించకపోవడమే నాకు స్టూడియో నిరాకరించడానికి కారణమైతే నా చిత్రం "పెళ్లికాని పిల్లలు" ఆ స్టూడియోలోనే పూర్తిగా తీయడం ఎలా సాధ్యపడిందో వారు వివరిస్తారా? నేను ప్రస్తుతం మద్రాసులో తీస్తున్న చిత్రం, మొట్టమొదట సారథీ స్టూడియోలో నిర్మించడానికి అన్ని ఏర్పాట్లూ జరిగినవని, ఆ చిత్ర నిర్మాణానికి అనుకూలమయిన కాల్‌షీట్లను నాకు లిఖిత పూర్వకంగా శ్రీ సి.వి.వి.ఆర్. ప్రసాద్‌గారి సంతకంతో ఇచ్చారని ఆయన వ్రాసియిచ్చిన ఉత్తరాన్ని నేను ఫిలిమ్ కంట్రోలరుకు దాఖలుచేసి ఫిలిమ్ పర్మిటు తెచ్చుకున్నానని నేను నిరూపించగలను. ఈ ఉత్తరం ఆయన నాకు 1962వ సంవత్సరం జూన్ మాసంలో ఇచ్చారు. ఈ ఉత్తరం ద్వారా నాకు వారి స్టూడియోలో చిత్ర నిర్మాణ సౌకర్యాలు ఏర్పాటుచేసినప్పుడు వారు చెప్పే బాకీ సంగతి మర్చిపోయారేమో!

1958లో సారథీ స్టూడియో ప్రారంభమయింది. అప్పటినుండి 1962 వరకు శ్రీరామకృష్ణప్రసాద్ 7 చిత్రాలు, నేను 3 చిత్రాలు, శ్రీ జగ్గయ్య ఒక చిత్రం— అంటే మొత్తం 11 చిత్రాలు నిర్మించడం జరిగింది. ఈ చిత్రాలలో నటించడానికి మన తెలుగు నటీనటులంతా చిన్నా పెద్దా తేడా లేకుండా హైదరాబాద్‌కు వచ్చి అక్కడి స్టూడియోలో పనిచేశారు. కానీ ఒక్క నాగేశ్వరరావు మాత్రం ఈ నాలుగు సంవత్సరాలు స్టూడియోలో అడుగైనా పెట్టలేదు. "అన్ని సౌకర్యాలు కలుగజేస్తాం, మీరు మా స్టూడియోలో చిత్రాలు తీయండి" అని సారథీవారు మద్రాసులోని చిత్ర నిర్మాతలందరికీ తెలియజేసినా ఏ ఒక్కరూ హైదరాబాదు స్టూడియోలో చిత్రం నిర్మించడానికి రాలేదు. 1962వ సంవత్సరంలో శ్రీ నాగిరెడ్డి తాత్కాలికంగా వాహినీ స్టూడియోను మూసివేశారు. అప్పటివరకు మద్రాసులోనే వాహినీ స్టూడియోలోనే చిత్రాలు తీస్తున్న అన్నపూర్ణ పిక్చర్సువారికి వారి తదుపరి చిత్రం తీయడానికి అనుకూలమైన స్టూడియో కరువైపోయింది. ఆ సందర్భంలో వారి వ్యాపార అవసరాల నిమిత్తం అన్నపూర్ణ పిక్చర్సువారు రావడం, "మాకు స్టూడియో ఇస్తారా" అని శ్రీ ప్రసాద్‌గారిని అడగటం ఆయన ముందు ఎవరెవరికి ప్రోగ్రాములు ఇచ్చామన్నది గమనించకుండా తమ "వ్యాపార అవసరాల కోసం" ఇంచుమించు మొత్తం స్టూడియో అన్నపూర్ణ పిక్చర్సు చేతుల్లో పెట్టడానికి ఒప్పుకొనడం జరిగింది. ఆ పైన శ్రీ నాగేశ్వరరావు మద్రాసులో నటించనని నిర్ణయం తీసుకోవడం, తను నటించే చిత్రాలన్నీ ఇకపైన హైదరాబాద్‌లోనే నిర్మించబడుతాయన్నీ, వారు ప్రాధేయపడినా రానటువంటి అగ్రనటులు, పెద్ద నిర్మాతలు, సంస్థలు ఇకపైన స్టూడియోను ఆదరిస్తారన్న ఆశాభావంతో తమ వ్యాపార అవసరాల

56 వ పేజీ చూడండి

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 10—7—'64
క్రోధినామ సం॥ ఆషాఢ మాసం॥ శు॥ పాడ్యమి
సంపుటము : 56 సంచిక : 45

స్థాపితము:
1908
*
ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడి ప్రతి 30 న. పై.
సంవత్సర చందా 15.60 న. పై.
6 మాసాల చందా 7.80 న. పై.
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1



ప్యానా గూర్ఖనాథి! వామపక్ష నాయకుడుగా నిలామణి అవుతున్నాడు....

## మనలో మాట

'కార్యసిద్ధి' సీరియల్‌లో చాలామందికి తెలియని వినాయకుని కథలు ఎన్నో ఉంటాయి! రచయిత ముద్దా చిట్టిబాబు అరవ పుస్తకాలు కొన్ని చదివి ప్రత్యేకంగా సేకరించారు వాటిని...

శ్రీ ముద్దా చిట్టిబాబు వయస్సు 26 సంవత్సరాలు. తాడేపల్లిగూడెంలో పుట్టారు. బి. ఏ. డిగ్రీ మద్రాసులో పుచ్చుకున్నారు. వివాహం అయింది. ప్రస్తుతం మద్రాసులో ఆంధ్రా బాంకులో పని చేస్తున్నారు...

రెండు వారాలుగా 'నెహ్రూ కథలు' కొన్ని వేస్తున్నాము. ఈ సందర్భంలో ఢిల్లీనుంచి వెలువడే 'ఆర్గనైజర్' పత్రికలో పడ్డ 'వార్త' ఒకటి పాఠకులకి అందజేయవచ్చునని పించింది. 1947 లో భారత ప్రధాని అయినప్పుడు జవహర్‌లాల్ నెహ్రూ వినాయకపూజలో పాల్గొన్నారుట!

* * *

ఈ సంచిక వెలువడే సమయంలో తెలుగు చలనచిత్ర పరిశ్రమకి సంబంధించిన ఇద్దరు ప్రముఖ వ్యక్తులు 'వార్తలలో ఉంటారు.' శ్రీ ఎన్. టి. రామారావుగారు ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిగారికి ఇచ్చిన లక్ష రూపాయల విరాళం వార్త ఈ సంచిక 53 వ పేజీలో చూడవచ్చు. భూగోళ ప్రదక్షిణ ముగించుకు వస్తూ ఉన్న శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారి రాకకి సంబంధించిన విశేషాలు కూడా ఇదే సంచిక 54 వ పేజీలో చూడవచ్చు...

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: రాజశ్రీ (ఫోటో: ప్రభాకర్)


మా మాటేమిటి?
ఆహార వ్యవహారాల సదస్సు


మెల్లిగా మాట్లాడండి! లేకపోతే నందా వింటాడు
ఈ అందగత్తెను పెళ్లి చేసుకోవా?
నాకిష్టం లేదు
ప్రభుత్వ వ్యాపారం
రాష్ట్రాలు


మేం అనుకున్న దానికంటే ఎక్కువ బరువే వున్నాడే!
సోవియట్ దృష్టిలో
శాస్త్రి

# నెహ్రూ



## కొన్ని మరుపురాని సంగతులు

### "గుళ్లోకా? ఎందుకూ?"

1939లో శ్రీ నెహ్రూ శ్రీలంకలో వున్నాడు. అతని నేస్తం ఒకరు విందుచేశారు. మన దేశవాళీ పద్ధతిలో అరిటాకుల్లో వడ్డించే యేర్పాట్లు చేశారివిందులో. సరే! సంతర్పణలాంటి విందుకదా, ఒక దేవుఁడిగుడి ప్రాంగణంలో ఏర్పాటు చేశారు. [కొలొంబోలో]—"సరే భోజనానికి వేళైంది! మనం గుళ్లోకి వెళ్దామా?" అన్నాడు మిత్రుడు "గుడీ? ఏం గుడీ? ఎందుకూ?" నెహ్రూజీ యించుమించు కోపడ్డాడనే చెప్పాలి: "అబ్బే! భోజనానికే నయ్యా" అని ఆయనకి బోధపరిస్తే శాంతపడ్డాడు నెహ్రూగారు.

* * *

సిలోన్‌లోని 'కురునెగలా' స్టేషన్‌లో జవహర్‌లాల్ నెహ్రూ, కీ॥ శే॥ బండారనాయకె కలిసి భోజనం చేస్తున్నారుట, ఒకసారి. ఎందరో ప్రజలు కిటికీలలోనుంచి, తలుపు సందులలోనుంచి తొంగి చూసి వెడుతున్నారు. నెహ్రూ తనతో కలిసి తింటున్న తక్కిన వారివైపు తిరిగి "బహిరంగంగా ఎన్నో పనులు చెయ్యగలను కాని భోజనంమాత్రం చెయ్యలేను!" అన్నారుట...

### "దేవుడా?"

1940 లో వ్యక్తి సత్యాగ్రహం జరుగుతున్నప్పుడు నెహ్రూ గాంధీజీ వద్దకి సేవాగ్రామ్ వెళ్లి "శలవు తీసుకున్నా"డు. బాపూ కస్తూరిబా [మాత] దగ్గర శలవుతీసుకుంటూ లేచి వెళ్తోన్న నెహ్రూని కస్తూరిబా "దేవుడు నిన్ను కాపాడుతాడు బాబూ!" అని దీవించింది.

"ఎక్కడ మ్మా వున్నాడు దేవుడు? పెంకెతనంగా ఎదురు తిరిగాడు నెహ్రూ. "వున్నాడే అనుకో, బహుశా వాడు గాఢంగా నిద్దరోతో ఉండివుండాలి" అని కూడా ఛలోక్తి పలికాడు. కస్తూరిబా విస్తుపోయిందిగాని బాపుజీ ఫకాలునా నవ్వి అక్కడే వున్న "శ్రీమతి అమృత్ కౌర్" కేసి చూస్తూ "మావాడే [నెహ్రూ] చాలామంది భక్తులమని చెప్పుకునే వాళ్ళకన్నా దేవుడికి దగ్గరగా ఉన్నవాడు సుమా" అన్నాడు. (నెహ్రూ మాటాడకుండా సత్యాగ్రహానికి వెళ్ళిపోయాడు.)

* * *

"కలకత్తా మైదాన్‌లో బహిరంగసభ జరుగుతోంది. నేను మాట్లాడుతున్నాను. ఎందుకో నాకు అర్థంకాలేదుకాని, అక్కడ పోగయి ఉన్న సుమారు పదిలక్షలమందీ నవ్వటం మొదలుపెట్టారు. ఏదన్నా తమాషాగా మాట్లాడానా? ఆహా! అంతపనీ చేశాను! నాపక్కనే జవహర్‌లాల్ నెహ్రూ ఉన్నాడు. అతన్నిగురించి మాట్లాడుతూ 'నా పాత స్నేహితుడు మోతీలాల్ నెహ్రూ,' అన్నాను. అది 1957లో" (కీ॥ శే॥ బి. సి. రాయ్.)

### ఆర్థిక ఇబ్బందులు

మోతీలాల్ నెహ్రూగారికి నెహ్రూ 1921 లో కూడా చిన్న కుర్రాడేకదా! 1921-25 ల మధ్య నెహ్రూకి స్వంత ఆర్జన యింతి పిసరుకూడా లేదు. తనూ భార్యా కూడా తండ్రిమీదనే ఆధారపడుతున్నామే అన్న బాధ శ్రీ నెహ్రూను చాలా మధనపరిచేది. ఖద్దరుగుడ్డలు, మూడో క్లాసు ప్రయాణాలు అప్పటికే అలవాటైనా, కేవలం ఏ అర్జనా లేకుండా నాన్నగారిమీదనే ఆధారపడటం ఎంత యిష్టం లేక పోయినా,

కాంగ్రెసువారి మాటనే ఏదైనా ఆర్జించుతావని తండ్రికి ఎలా చెప్పాలో తెలిసేదికాదు. చివరికి ఓసారి 'నేనేదైనా జీవనోపాధికి ప్రయత్నిస్తా' నన్నాడు చాలా గంభీరంగా.

మోతీలాల్ "అది శుద్ధ తెలివి తక్కువతన"మని కొట్టిపారేయడం జరిగింది. పైగా "నేను కొంచెం రోజుల్లో చేసే ఆర్జన నీకూ నీభార్యకీ ఒక ఏడాదిపాటు సరిపోతుంది" అని కూడా మందలించాడట శ్రీ మోతీలాల్. నెహ్రూగారు యిలాంటి సంసారికమైన ఆర్థిక యిబ్బందులు 23-25 మధ్య బాగా అనుభవించారని స్వీయచరిత్రలో వుంది.

* * *

శ్రీ సయ్యద్ మహమ్మద్ ప్రయాణం చేసినప్పుడల్లా వెంట పనిమనిషిని తీసుకుపోయేవారుట.

## మరుపురాని సంగతులు

శ్రీ నెహ్రూ పనివాడు ఎందుకని అడగగా, తనకి పక్క వేసుకోవటం ఇష్టంలేదు కనుక ఆపని చేయించుకునేందుకని శ్రీ మహమ్మద్ చెప్పారుట. అప్పటినుంచి వారిద్దరూ ఎప్పుడు కలిసివెళ్ళినా జవహర్‌లాల్ నెహ్రూయే సయ్యద్ మహమ్మద్ పక్క వెయ్యటం ప్రారంభించారుట! వద్దని ఎంతచెప్పినా వినిపించుకునేవారు కారుట...

### తల్లిప్రేమ

జైలులో దారుణమైన కొట్టులో సకల జంతు కోటిమధ్య బారెలీ ఖైదులో వుండగా తల్లి 'ప్రేమ' ఎంత సాహసము, నిజమూ గలదో ఒక 'కోతి చేష్ట'వల్ల తెల్సింది నెహ్రూ గారికి. కోతులుండేవి అక్కడ.

ఓసారి ఖైదు కవతల ఒక చిన్న "కోతికూన" బారకాసు కటకటాల గోడమీద నుంచి యివతలకి జారిపోయింది. మళ్లీ పైకిఎక్కలేక పోతోంది. కొందరు ఖైదీలు, యితర ఖైదు వుద్యోగులు దాన్ని పట్టుకుని మెడకి త్రాడుకట్టి ఆట పట్టించసాగారు. తల్లికోతి క్రూరులు ధరించిన "క్రూరాత్ములు, మానవులు" యిలా తనబిడ్డను బాధించడంపై నుంచి చూసి సహించలేక పోయింది. ప్రాణాపాయకరమైన సాహసంతో పదుల కొద్దీవున్న ఆమనుష్యులమీద కది ఉదాటున దూకి, ఎదుర్కొని తనబిడ్డను ఎత్తుకుని పారిపోయింది. ఆ శత్రుహస్తులు చెల్లాచెదరై పోయారు ఆ మాతృమూర్తి మమత ముందు! ★



నలభై తొమ్మిదిసార్లు అంతరిక్షంలో భూప్రదక్షిణం చేసిన రోదసీ మహిళ మా పాఠకులకు సుపరిచితురాలే (6—12—63 సంచిక) వాలెంతినా తెరెష్కోవా 7 వ తారీఖున చక్కని కుమార్తెను కన్నది. రోదసీ పుత్రికకు పేరు 'ఎలెనా' అని పెట్టారు!

# సాహిత్య అకాడమీ ఎన్నికల విశేషాలు!

నీలం సంజీవరెడ్డిగార్ని, కేంద్రమంత్రిగా నియమించటంపట్ల చాలా మంది సంతృప్తి పడ్డారు. పదవుల్ని యెంత తేలికగా వదిలిపెడితే, అంత త్వరగ మళ్లీవచ్చి వరిస్తాయని, సంజీవరెడ్డిగారు అన్నమాట మళ్లీ ఇంకోసారి నిజమయింది. అయితే సుప్రీమ్ కోర్టువారు ఆయన పట్ల వెలిబుచ్చిన అభిప్రాయం దృష్ట్యా గదా, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి పదవికి రాజీనామాఇచ్చింది. అలాంటి వ్యక్తిని, కేంద్రంలోకి తీసుకోవటం ఏమంత సబబు అని ప్రశ్నించేవారు కూడా కొందరు లేకపోలేదు.

సినిమా రంగంలో అనుకున్నంత ఉత్సాహం కనబడటంలేదు. ప్రభుత్వం వారు ప్రకటించిన సహాయ పథకాలు, సినిమా పరిశ్రమకు ఎప్పుడు అందుబాటులోకి వస్తాయో అర్థం కాకుండా ఉంది. కొత్త స్టూడియోలు ఎప్పట్లో యేర్పడతాయో అంతకంటె అగమ్య గోచరంగా ఉంది. వచ్చిన దరఖాస్తులను పరిశీలించటంలోనే ఉంది ఇంకా. ఈ లోపల, ఉన్న సారథీ స్టూడియోలో మాత్రం, పని చురుకుగానే సాగిపోతోంది. అంతా కొత్త వాళ్లతో నింపేసిన 'తేనె మనసులు' చిత్రం షూటింగ్ ప్రారంభమయింది. సంతృప్తికరంగానే ఉంటుందని అనుకుంటున్నారు. తర్వాత ఈ జూన్, జులై నెలల్లో, అన్ని చోట్ల ఉన్నట్టే ఇక్కడ కూడా బడి పిల్లల హడావిడి చిన్న తరగతుల్నుంచి, పెద్ద కోర్సుల వరకు, విద్యార్థి బృందం ఒకటే ఎగబడటం, అందర్నీ సంతృప్తి పరచలేక సంస్థల వారు విమర్శలకు గురి అవటం— ఇది యేటేటా జరుగుతున్న మామూలు పద్ధతే. నాలుగు సీట్లు ఎక్కువ చేసినా ప్రయోజనం లేదు. నలుగురు విద్యార్థులు చదువు మానేసినా ఉపయోగం లేదు. అసలు విద్యా విధానం మూలంలోనే గొప్ప మార్పులు రావాలి. అప్పటికి గాని ఇప్పటి అసంతృప్తి సమసిపోదు. కేంద్ర విద్యామంత్రి చాగ్లాగారు కొత్త విధానాన్ని ప్రవేశ పెట్టటానికి ప్రయత్నిస్తున్నట్లు తెలుస్తోంది. అదేమిటో వేచి చూడాల్సి ఉంది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ నూతన కార్యవర్గం సమావేశమయింది. ఈ కార్యవర్గపు ఎన్నికల ముందు ఎన్నో విమర్శలు చెలరేగినాయి. వాటిలో కొన్ని, ఎన్నికల దృష్ట్యా తప్పని సరిగా వచ్చినప్పటికి కొన్ని మాత్రం నలుగుర్నీ ఆకర్షించినాయని చెప్పక తప్పదు. వాటిలో ముఖ్యంగా, ఆధునిక సాహిత్యానికి, అకాడమీవారు, యేమాత్రం ప్రోత్సాహం ఇవ్వటం లేదనేది, దీని మూలాన, ఈ విషయాన్ని పరిశీలించటానికి గానూ, ఉప సంఘాన్ని వేయటం జరిగింది. ఇప్పుడు తీసుకున్న నిర్ణయాలను బట్టి, మూడు బహుమానాలు ఇస్తారు. 1959 సంవత్సరము నుంచి, 1963 ఆఖరి దాకా, అచ్చయిన, ఉత్తమమని నిర్ణయింప బడిన ఒక నవలకు, కథా సంపుటికి, పద్య కవిత్వానికి, వెయ్యి నూట పదహార్లు చొప్పున ఇస్తారు. నవల పుస్తకరూపంతో 150 పేజీలు కాని, కథా సంపుటము 120 పేజీలదాకా వుండాలి, పద్య కవిత్వం వెయ్యి పంక్తులుంటే చాలు. ఏటేటా ఈ మూడు బహుమానాలు, గత అయిదేళ్లలోనూ, అచ్చయిన గ్రంథాలను పరిశీలించి, ఇవ్వటం జరుగుతుంది. ఎన్నుకోబడిన కొన్ని తెలుగు కథలను, హిందీ భాషలోకి అనువదించి, పుస్తక రూపంగా తీసుకు వస్తారు. ఈసారి పోటీకి ఉర్దూ నాటికను తీసుకున్నారు. వచ్చిన వాటిల్లో ఉత్తమమైనదానికి వెయ్యినూట పదహార్లు ఇస్తారు. ఈ విధంగా బహుమానాలు ఇవ్వటంతోనే ప్రోత్సాహము లభిస్తుందని, అనుకునే వాళ్లకు, ఈ పథకాలు బాగా సంతృప్తినే ఇస్తాయి.

ఇంకా తెలుగు సామెతలు, బ్రౌన్ నిఘంటువు శ్రీనాథ, తిక్కన్న, పదప్రయోగ కోశాలు, పుస్తకాల రూపంగా తీసుకు వస్తారు. వృత్తి పదకోశాలు పుస్తకాలు అచ్చు వేయటం అది వరకే ప్రారంభమయింది. వ్యవసాయానికి సంబంధించిన పుస్తకంతో పాటు, చేనేత, పల్లె, పదాల వృత్తి పదకోశాలు కూడా తయారు చేస్తున్నారు. దేశ భాషల్లో రచయితలు, వారి రచనా వైవిధ్యాన్ని, తెలుగు వారికి అంద చెయ్యాలని సంకల్పించారు. సారస్వత చరిత్రలు, తెలుగులో మహా కావ్యాలని, హిందీలోకి అనువదించటానికి, 'మె। హా సావనీర్' తీసుకురావటానికి కూడా నిర్ణయాలు తీసుకున్నారు. తర్వాత హిందీ రచయితల 'సెమినార్' జరపటానికి కూడా నిశ్చయించారు. అకాడమీవారు తీసుకున్న నిర్ణయాల్లో, ఇవి కొన్ని, అది వరకు వచ్చిన విమర్శలను, కార్య నిర్వాహకులు శ్రద్ధగా గమనించి ఈ పథకాలను, అమలు చెయ్యటంలో అత్యంత శ్రద్ధ, సమర్థత చూపించ గలరని ఆశించవచ్చు.

కార్య నిర్వహణలో, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ కూడా బాగానే పోటీ పడుతోంది. వివిధ ఉప సంఘాల సమావేశములు జరిగాయి. ఈ ఏడు నుంచి, సినిమా రంగంలో వివిధ కళాకారుల్ని సన్మానించడం, పెట్టుకున్నారు అకాడమీవారు. ఈ కొత్త నిర్ణయాన్ని అమలు చెయ్యటంతో కూడా కొత్త పద్ధతినే అవలంబించారు కూడా. రాష్ట్రపతి బహుమానాలు పొందిన సినిమాల నిర్మాతలను, సాంకేతిక నిపుణులను, నటీనటులను సన్మానించటంతో ప్రారంభమయింది. రవీంద్రభారతిలో జరిగిన ఈ సన్మాన సభకు, రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షత వహించారు. సినిమా పరిశ్రమను, ప్రభుత్వంవారు ప్రోత్సహించదలుచుకుని, రూపొందించిన పథకాలు అందరికీ తెలిసినవే ఈ దృష్టితోనే, 'సినీ టెక్నాలజీ కోర్సు'ను కూడా ఈ ఏడాది నుంచే ప్రారంభిస్తామన్నారు. స్త్రీల కళాశాలల్లో, నృత్యం, నాటక కళను, ప్రోత్సహించటానికి అనువైన వాతావరణం కల్పించబడాలి. ఒరిస్సాలో ఈ విధంగా ప్రోత్సాహం ఇవ్వటం వలనే, ఎంతోమంది యువతులు, చూడ ముచ్చటగా ముందుకు వచ్చి తమ నటనా చాతుర్యాన్ని ప్రదర్శించ కలిగారు. ఈ పద్ధతిలోనే ఆంధ్రప్రదేశ్ లోని కళాశాలల్లో కూడా ప్రోత్సాహం లభించాలి. దీనికి యేమంత డబ్బు కాదు. సంగీత నాటక అకాడమీ వారు పూనుకున్నా సరే, లేకపోతే ప్రభుత్వం వారే సహాయం చెయ్యగలరు. అని కూడా ముఖ్యమంత్రిగారు ఈ సందర్భంలో అన్నారు.

ఏటేటా కూడా సినిమా కళాకారులను సన్మానించటానికి గాను, సలహా ఇవ్వటానికి, ఒక ఉప సంఘం నియమిస్తామని, దాంట్లో ప్రముఖ సినీ కళాకారులు కొంత మంది సభ్యులుగా ఉండగలరని అకాడమీ అధ్యక్షులు చెప్పారు. ఇప్పుడయితే సన్మానింప బడినవారిలో లక్ష్మీరాజ్యం, కుమారి జమున, యస్. వి. రంగారావు, కాంతారావు, ప్రభృతులున్నారు. ఈ సమావేశానికి రాజాలవి

---

## ఇంటింటి పద్యాలు

**ఆరుద్ర**

### అడగని యక్షప్రశ్న

రోజూ గీసుకోని మగాడి గడ్డం
మోజున్న సరసానికొస్తుందా అడ్డం?

### దస్తూరీ ఒక్కటే స్వహస్తం *

ప్రియమైన కవిగారూ! చదివా మీ అసంపూర్ణ కావ్యం
పేరు చెప్పకుండా తస్కరించిన భావాలు మాత్రం దివ్యం!
తాము చూపించాలి ఇంకొంచెం ధైర్యం
దయచేసి చేయండి తలిమ్మాకీ చౌర్యం!

* ఈ రచనలో ఉంది ఔచిత్యం ఇంపు
ఇది ఇంగ్లీషు పద్యానికి తెనిగింపు!

నటీ నట వర్గానికి 'ట్రోఫీస్' అందచేయ బడ్డాయి. వర్తనశాల, లవకుశ, అమరశిల్పి జక్కన్న, మూగ మనసులు, చిత్రాలకు బహుమతులు వచ్చినట్టు అందరికీ తెలిసిందే. వాటి తాలూకు, నిర్మాతలు, దర్శకులు కూడా హాజరయి స్వయంగా గౌరవాన్ని పొందగలిగారు. విపరీతమైన వర్షం మూలాన, ఈ సభ పెద్ద హడావిడిగా జరగలేదనుకున్నారు. వర్షం కూడా ఒక కారణం కావచ్చు. తగిన వ్యవధి లేక పోవటం మరొక కారణం కూడానేమో. ఏ మయి నప్పటికీ, ముఖ్యమంత్రిగారు చెప్పినట్లు, బొంబాయిలో సినీ కళాకారులకు భారీఎత్తున, ఇలాంటి సన్మానాలు జరుగుతూ ఉంటాయి, అలాంటి అట్టహాసమే మన రాజధాని నగరంలో కూడా చూపించాలి. మరి ముందుముందు జరగబోయే వాటికి ఎలాంటిపద్ధతి అవలంబిస్తారో చూడాలి.

సంగీత నాటక కళా అకాడమీ వారు ఏర్పాటు చేసిన ఉపసంఘంలో యస్. వి. రంగారావుగారు ముఖ్య పాత్ర వహిస్తారు. ఈయన ఆంధ్ర దేశంలో గొప్ప నటునిగా పేరు పొందటమే గాకుండా, జకర్తాలో జరిగిన 'ఫిలిమ్ ఫెస్టివల్'లో కూడా ప్రముఖ నటునిగా పరిగణింప బడ్డారు. పధ్నాలుగు దేశాల వారు కలిసి జరిపిన ఈ ఎన్నికలో, ఇలాంటి అపూర్వ గౌరవము జపాన్‌లోని మరొక నటునికి మాత్రమే లభించింది. రంగారావుగారు ఇంతటి ఉత్తమ స్థాయిని అందుకోవటం, మనందరికీ గర్వకారణమే. సరదాగా ఏర్పాటు చేసిన సమావేశంలో, రంగారావుగారు, జకర్తా విశేషాలు చెపుతూ, కొన్ని అభిప్రాయాలు వెలిబుచ్చారు. ఇవి, ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరంలో, సినిమా పరిశ్రమ అభివృద్ధిని గురించినవి.

మద్రాసు కంటె, యెన్నో రెట్లు, హైదరాబాదు, సినిమా పరిశ్రమ అభివృద్ధికి, అనుగుణంగా ఉంటుందనటంలో సందేహం లేదు. అయితే ఎన్నో ఏళ్ళుగా పాతుకు పోయిన ఆ పరిశ్రమ ఒక్క పెట్టున హైదరాబాదుకు తరలించాలంటే మాటలతో అయ్యేపని కాదు. క్రమక్రమంగా, అలాంటి వాతావరణం కల్పించబడాలి. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారు సంకల్పించిన పథకాలు, పరిశ్రమాభివృద్ధికి ఎంతవరకు దోహదమిస్తాయో ఆలోచించాలి. అయిదు లక్షలు, స్టూడియో నిర్మాణానికి ఇచ్చేబదులు, ప్రభుత్వం వారే, స్టూడియో 'ఎక్విప్‌మెంట్'ని తీసుకు రాగలుగుతారు. అప్పుడు నిర్మాతలు కూడా కాస్త ఊపిరి పీల్చుకోటానికి అవకాశం ఉంటుంది. కేవలం స్టూడియోకు కావలసిన యంత్రాలు వగైరా ఏర్పాటు చేసుకోవటమే కాబట్టి, ఆట్టే బాధ ఉండదు. అది గాక, ప్రభుత్వంవారు పెట్టిన రెండేళ్ల గడువు వ్యవధి చాలా తక్కువ. అయినా, ప్రభుత్వం వారు, మీకేం కావాలని, మమ్మల్ని అడుగుతేగా, మేం చెప్పేది. సినిమా పరిశ్రమాభివృద్ధికి కావలసిన వేమిటీ అని, దానికి సంబంధించిన, నలుగురూ కూర్చుని ఆలోచించాలి. అంతేగాని, ఎవరి గొడవ వాళ్లు చూసుకుంటే లాభం లేదు, అంటూ నిర్మొహమాటంగా కొన్ని సత్యాలు చెప్పారు రంగారావుగారు.

ఎ. ఎల్. ఎస్. ★

ప్రియమైన శర్మా !

నీ కిన్నాళ్లకి ఓ శుభవార్త వ్రాయగలుగుతున్నాను. రాధిక పెళ్లికి ఒప్పుకుంది. ఇన్నాళ్లకి నేను కూడా ఓ ఇంటి వాణ్ణి అయే సూచనలు కనిపిస్తున్నాయి. ముహూర్తం కుదరగానే శుభలేఖ పంపిస్తాను. కుంటి సాకులు చెప్పక తప్పక రా.

నాకు చాలా ఆనందంగా ఉంది దేవుడు ప్రత్యక్ష్యమై వరం కోరుకోమన్నా "ఇంకేం వద్దు సార్ !" అని నిష్కర్షగా చెప్పేస్తాను. నీకంటే ఆనందించేవాళ్లు ఇంకెవరూ లేరని నీకు ముందర వ్రాస్తున్నాను. ఈ ఆనందంలో మాట తోచడం లేదు. ఇంక ఎక్కువ వ్రాయలేను. మరో ఉత్తరంలో విపులంగా వ్రాస్తాను.

ఇట్లు
నీ (కొన్నాళ్లకి మరొకళ్ల)
మురళీధర్.

తప్పకుండా వెళ్లాలి. ఎల్లాగైతేనేం? సాధించాడు. ప్రేమించి పెళ్లి చేసుకుంటున్నాడు. ఒక అమ్మాయిని చూడగానే ఈమె నాభాగస్వామిని అయితే బాగుండుననే భావం కలిగితే అదే ప్రేమ అని మురళీధర్ నిర్వచించేవాడు. ఇది సాధారణంగా ప్రతి మగవాడికి ఎప్పుడో ఒకసారి కలుగుతుంది. కొందరు లేమిని మరి కొందరు కలిమిని అసలు చవిచూడకుండా జీవితాంతం గడిపిన వాళ్లున్నారు. కాని ఈ ప్రేమించే దశను అనుభవించని వాళ్లు అరుదు. లేరనే చెప్ప వచ్చును. పెళ్లి చూపులకి వెళ్లిన ప్రతీ యువకుడు ఈ అమ్మాయిని చేసుకుంటే బావుండునని అనుకుని తరువాత చేసుకుంటున్నారు. కొందరు యువకులు ఈమెను చేసుకుంటే బావుండునని అనుకుని వేరొకరిని చేసుకోటం, కారణాంతరాల వల్ల, లేకపోలేదు. కాని భావం ముఖ్యం కనుక వాళ్లూ ప్రేమించినట్టు లెక్కే. అందుకని ప్రేమ అనేది దారిద్ర్యం. కన్నీళ్లు మొదలైన వాటికంటే అతి వాస్తవికమైనదని మురళీధర్ ఉద్దేశం.

అయితే కొందరికి ప్రేమలు ఫలిస్తాయి. కొందరికి తిరస్కరింప బడటం, విధి అడ్డుపడి ఆగిపోడం సంభవిస్తాయి. వాళ్లు ప్రేమ ఉధృతం కొద్దీ, శక్తి కొలది తాగుడలవాటు చేసుకోటం, ఆత్మహత్య చేసుకోడానికి ప్రయత్నించడం చేస్తూ ఉంటారు. అది పిరికితనం అని మురళీధర్ ఉద్దేశం. అతని మటుకు అతను ప్రేమలో చాలాసార్లు పరాజితు డయ్యాడు. అతని ప్రేమ సూర్యుడి వలె ఇప్పుడస్తమించినా మళ్లీ ఉదయించేది. అస్తమయానికి ఉదయానికి మధ్య ఉన్న కాల వ్యవధి సూర్యుడి విషయంలో భూభ్రమణాన్ననుసరించి మారితే మురళీధర్ విషయంలో అది ప్రేమ తీవ్రత ననుసరించి మారేది. కాని అది ఉదయిస్తే మళ్లీ ద్విగుణీకృత ఉత్సాహంతో తల మునకలు అయి పోయేవాడు. అటువంటి మురళీధర్ కూడా ప్రేమించడం అనే సహజ గుణానికి వ్యతిరేకంగా, గ్రహణ కాలంలో సూర్యుడు ప్రకాశించినట్టు, అయిపోయాడు. తరువాత అమ్మాయిలతో మాట్లాడాల్సి వస్తే "చెల్లీ !" అనో "అక్కా !" అనో సంబోధించి మాట్లాడేవాడు.

మురళీధర్ విచిత్ర వ్యక్తి !

ఆ కాలేజిలో ఏ. యు. సి. కి చేరడానికి చాలా భయపడుతూనే చేరాను. భయపడ్డమెందుకంటే నేను దానిని గురించి చాలా చెడ్డగా విన్నాను. అసలు ఆ కాలేజీ మాటేమిటి? తెలుగుదేశంలో చాలా కాలేజీలకు సంగ్రహంగా ఒకటే వర్తమాన చరిత్ర. ఏ విద్యార్థినైనా పట్టుకుని వాళ్ల కాలేజీ విశేషాలు అడిగితే బొత్తాలు పెట్టుకోని చొక్కా కాలరు సరిచేసుకుంటూ "మా కాలేజీలోనండీ ప్రిన్సిపాలుకు మేమంటే భయమండీ. ఒకసారి ఎవరినో సస్పెండు చేస్తే స్ట్రైకు చేసి ప్రిన్సిపాలు చేత క్షమాపణ చెప్పించారు విద్యార్థులు. మరొకసారి ఒక అబ్బాయికి, మా క్లాసు వాడేనండి" ఇది కొంచెం గర్వంగా అని "ఒక అమ్మాయిని ఏడిపిస్తూంటే పట్టుకుని అర్థ రూపాయి పైను వేశాడు ప్రిన్సిపాలు. అతను 'మరొకసారికి ఉంచుకోండి' అని ప్రిన్సిపాలు చేతిలో రూపాయి పెట్టాడు. అప్పట్నించి ప్రిన్సిపాలు మా జోలికి రాడు. అసలిదంతా ఏముంది. తెలుగు లెక్చరర్ క్లాసులు చూడాలండీ మీరు ! క్లాసులోంచి వెళ్లిపోయే వాళ్లు కొందరు, పిల్లి కూతలు కూసేవాళ్లు కొందరు, ఆడపిల్లల మీద కాగితపు ఉండలు విసిరే వాళ్లు కొందరు. బలే ఉంటుంది లెండి. అందుకని నేను మాత్రం తప్పకుండా ఆ క్లాసుకి వెళ్తాను. క్షమించాలి. తెలుగు క్లాసుకు టైము అయింది" అని చెప్పి వెళ్లిపోయినా ఆశ్చర్యపడనక్కర్లేదు. అల్లాంటిదే ఆ కాలేజీను. అందుకనే నేను అందులో జేర్తుంటే "చెడు స్నేహాలు చెయ్యకు" అని అమ్మ కళ్లనీళ్లు పెట్టుకుంది. నాన్నగారు "నువ్వా వెధవలతో చేరితే డొక్క చీల్చేస్తా !" అన్నారు. నేను పెద్దవాడినయ్యానని కాలేజీలో చదవబోతున్నాననన్నా గౌరవం లేకుండా.

నాన్నగారు ఆడి తప్పరు. అందుకని నేనూ మా పక్కింటి లక్ష్మిలాగే కాలేజీకి తలవంచుకుని వెళ్లి వస్తూ ఉండే వాడిని. క్లాసులో మగ పిల్లల్ని కూర్చోనిచ్చినంత దగ్గరగా మేష్టరుకి, కూర్చుని పాఠాలు వినేవాణ్ణి. ఎవరినీ నా అంతట నేను మాట్లాడించ లేదు. ఒకరోజు మాథమాటిక్స్ క్లాసుకి పావుగంట ముందర వెళ్లి క్రితం రోజు చెప్పిన లెక్కతో కుస్తీ పడుతున్నాను. ఇంతలో సన్నగా బాగా ఉన్న మా క్లాసు అబ్బాయి వచ్చి "ఏమండీ మీరేనా ఫలానా స్కూలుకి ఫస్టు వచ్చింది?" అని అడిగాడు.

ఆ కాలేజీలో చదువును గౌరవించే వాళ్లు లేక పోలేదని తెలిసి ఆశ్చర్యపోయాను. "అవునండీ" అని జవాబు చెప్పి. "ఏమండీ అల్లా అడిగారు" అని అడిగాను.

"ఏమీ లేదండీ ! ఈ కాలేజీలో జేరిన వారందరిలో ఎవరికి యస్. యస్. యల్. సి. లో ఎక్కువ మార్కులు వచ్చి ఉంటే వాళ్లకి స్కాలర్ షిప్ ఇస్తారు. మీరు జేరకపోతే అది నాకు రావలసింది. మీతో పరిచయం నాకు చాలా ఆనందంగా ఉంది. నా పేరు మురళీధర్" అన్నాడతను.

తనకు రావలసినది నాకు వస్తోందన్నమాట. అదృష్టం కొద్దిలో తప్పినా అంత నిర్విచారంగా ఉన్న అతన్ని చూసి ఆశ్చర్యపోతూ "నా పేరు శర్మండీ !" అన్నాను.

అదీ మురళీధర్‌తో నా పరిచయానికి నాంది. మురళీధర్‌తో నా స్నేహం సాయంకాలపు నీడలాగ పెరుగుతూ వచ్చింది. అతను ఆటలు బాగా ఆడేవాడు. లెక్కలు చాలా సులభంగా చేసేవాడు. అందుకని మా ఇంట్లో అతనితో నా స్నేహాన్ని ప్రోత్సహించారు. రోజూ ఇద్దరం షికారుకి కలిసి పోతూండే వాళ్లం.

కాని ఇన్ని సుగుణాలతోపాటు అతనికి ఆడపిల్లలంటే ఇష్టం కూడా ఉంది. రోజులో కొంత భాగం వాళ్ల కోసం గడిపేవాడు. ఆశ్చర్యం ఏమిటంటే వాళ్లు కూడా ఇతని పట్ల ఆసక్తి చూపించేవారు. ఇది నాకు చాలా రోజుల వరకు తెలియదు. ఒకరోజు అతను వచ్చి "శర్మా ! రావోయ్ ! డిబేటు ఉంది ఇవాళ నేను మాట్లాడుతున్నాను." అన్నాడు. అప్పటికే మా స్నేహం ఏమండీ దశ లోంచి ఏంవోయ్ దశలోకి మారింది. సరే అని వెళ్లాను. మురళీధర్ వాదంలో బలం లేకపోయినా తెలివి ఉంది. అతనిది అవగానే "పోదామా" అన్నాను.

"నాది వినటానికి కాదోయ్ నిన్ను పిలుస్తే. మన క్లాసులో నాంచారి అన్న అమ్మాయి ఉందే. ఆ అమ్మాయి చాలా బాగా మాట్లాడుతుంది. విని నీ అభిప్రాయం చెప్పు." అన్నాడు. ఇద్దరు ముగ్గురి తరువాత ఆ అమ్మాయి మాట్లాడింది. నాకు పెద్ద అద్భుతంగా లేదు. మురళీధర్ ఆ తరువాత నా అభిప్రాయం అడగనూ లేదు. డిబేటు అయి పైకి వస్తుంటే "మీరు చాలా బాగా మాట్లాడారండీ" అన్నాడు మురళీధర్ నాంచారి అన్న అమ్మాయితో. "చాలా థాక్సండీ ! మీ అంత బాగా మాట్లాడ లేదులెండీ" అంది ఆమె. ఆమె ఇల్లు వచ్చే వరకూ ఇద్దరూ నన్ను మరిచిపోయి పరస్పరం పొగుడుకుంటూ నడిచారు. ఆమెను దిగ బెట్టాక "ఆ అమ్మాయి బాగుంది కదూ ! నేను ఆమెను ప్రేమించాను" అన్నాడు.

నాకు కాస్సేపు అతను ఏమంటున్నదీ అర్థం కాలేదు. పదహారు పదిహేడేళ్ల అబ్బాయిలు కూడా ప్రేమిస్తారని నాకు అప్పటికి ఎరకు తెలియదు. "ఆ అమ్మాయి నీ కంటే పెద్దదేమో" అన్నాను. ఏమనాలో తెలియక.

"ఆ అదంతా పూర్వం రోజుల్లో. పెద్దదైతేనేం ప్రేమించడానికి" అన్నాడు. "మీ ఇంట్లో ఒప్పుకుంటారా ?" అని అడిగాను అనుమానంగా. "ఇంట్లో వాళ్లు ఒప్పుకుంటారో లేదో అడిగి ప్రేమిస్తామా ?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

దీనికి జవాబు నాకు తెలియదు. కాని ఈ విషయము మా నాన్న గారికి తెలుస్తుందేమో అన్న భయం వేసింది. మా నాన్న గారికి తెలియకో తెలిసినా అతను బాగా చదువుతాడు గనుక అతని తోటి స్నేహం చెడ్డదిగా భావించకపోడం చేతో మా స్నేహం మాత్రం నిరాటంకంగా సాగింది. అయితే మురళీధర్ ప్రేమ మాత్రం అల్లా సాగలేదు.

ఏడాది చివర వరకు నాంచారి, మురళీధర్ సవ్యంగానే ఉన్నారు. కాని ఏడాది చివర జరిగిన "స్త్రీల హక్కులు" అన్న విషయం గురించి జరిగిన వాగ్వాదపు పోటీలో స్త్రీలకు హక్కులు అవకాశాలు చాలా ఉండాలని వాదించి మురళీధర్ బహుమతి సంపాదించినా నాంచారిని పోగొట్టుకున్నాడు. నాంచారి అతన్ని కంగ్రాట్యులేటు చేస్తూ "స్త్రీలకు అవకాశాలు ఉండాలండీ ! భర్తలు

ప్రోత్సహించి భార్యల చేత ఉద్యోగాలు చేయించి నప్పుడే దేశానికి ప్రగతి " అంటూ ఉద్రేకంగా చెప్పుకుపోతూ " ఏమంటారు ? " అని అడిగింది.

అతను " ప్రైజు కోసం అల్లా మాట్లాడాను కాని నాకు మాత్రం స్త్రీలు చక్కగా ఇల్లు చక్క దిద్దు కోవడమే ఇష్టం." అన్నాడు.

" మనసులో వూహాలు పాత చింతకాయ పచ్చళ్లు. బయటికి ఆదర్శ ప్రగల్భాలు " అని నాంచారి కోపంగా వెళ్లి పోయింది. అలా వెళ్లి

# మయూరి

పోయిన నాంచారి మళ్లీ అతని జీవితంలోకి తొంగి చూడలేదు. దీంతో మురళీధర్ పెద్ద వేదాంతిలాగా మారి పోయాడు. కాని అదృష్టం కొద్దీ పరీక్షలు దగ్గర పడటంలో ఇది మరచి పోయి చదువులో పడ్డాము.

పి. యు. సి. పాస్ అయ్యాము. మేము ఫిజిక్స్ ఆనర్సు చదువుతామని పేచీ పెట్టాము. నాకు పెద్ద సైంటిస్టులమవాలని కోరిక. ఇంజనీరింగు చదవమని ఇంట్లో గొడవ పెట్టారు. ఎల్లాగయితేనేం ఫిజిక్సు బి. యస్. సి. చదివేటట్లు ఆ తరువాత పంస్థలను బట్టి బెంగుళూరులో బి. యస్. సి. తరువాత ఇంజనీరింగు మూడు సంవత్సరాలే కనుక అక్కడ ఇంజనీరింగు చదవటమో యూనివర్సిటీలో యం. యస్. సి. చదవటమో తేల్చుకోవచ్చునని నిశ్చయించారు పెద్దవాళ్లు.

కాలేజీలో జేరిన కొద్ది రోజులకే మళ్ళీ మురళీధర్‌లో ప్రేమ ఉదయించింది. బి. యస్. సి. రెండో ఏడు చివరికి వచ్చేసరికి ఎంతోమంది సరోజలు, వనజలు అతని హృదయంలో దీపాలు వెలిగించినా అతను ఏదో చిన్న పొరపాటు చేస్తూ ఏ దీపాన్ని సరిగ్గా కాపాడుకోలేకపోవడంవల్ల ఆరి పోతూ వచ్చాయి. అయితే అతను నిరాశ పొందలేదు. ఆ యేడాది కాలేజి వార్షికోత్సవాలలో ఆ యేడే పి. యు. సి. లో జేరిన రాధిక నృత్య ప్రదర్శన నిచ్చింది. అది చూసి ఇంటికి వెళ్తూ మురళీధర్ తన హృదయం తనతో రావటం లేదని అది ఆమె దగ్గర ఉండిపోయిందని చెప్పాడు. ఆమె ఇంటి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తూ ఆమె బయటికి వచ్చినప్పుడు బయట నుంచే ఆమె దర్శనం చేసుకుని తృప్తి పడుతూ ఉండేవాడు.

ఆమె చేత గుర్తింప బడేసరికి వేసంగి సెలవలు ఇవ్వనూ ఇచ్చారు. మళ్ళీ కాలేజీలు తెరవనూ తెరిచారు. ఒకరోజు మురళీధర్ గాల్లో తేలుతూ వచ్చి చెప్పాడు రాధిక బియ్యేలో చేరిందని ఆ రోజే జీతం కట్టిందని. ఇంకో రోజు "నేను డ్రమెటిక్ ఎసోసియేషన్ ప్రెసిడెంట్ షిప్‌కి నిలబడుతాను" అన్నాడు.

"ఎందుక"న్నాను.

"రాధిక కోసం. ఎంతో కాలం ఇల్లా దూరం నుంచి ఆరాధిస్తూ గడపలేను" అన్నాడు. "దానికీ దీనికీ సంబంధం ఏమిటి" అని అడిగాను అర్థంకాక.

ఈ మాత్రం తెలియదా అన్నట్టు చూసి "ప్రెసిడెంటు అయితే ఆమె నృత్య ప్రదర్శనలు ఏర్పాటు చెయ్యటం కోసం వెళ్లినట్టు వెళ్లి పరిచయం చేసుకోవచ్చును. ఆ తరువాత మన శక్తి మీద ఆధారపడి ఉంటుంది. ఇది నాకు తోచిన రాజమార్గం" అన్నాడు.

ఎలక్షన్సులో నిలబడి గెలిచాడు. ఎసోసియేషన్ ప్రారంభోత్సవానికి నృత్య ప్రదర్శనం ఏర్పాటు చెయ్యనూ చేసి ఆమె పరిచయం సంపాదించాడు. పూర్వమే ముఖ పరిచయం ఉంది కనుక సుఖువుగా జరిగి పోయాయి. ఆమె నృత్యాల్ని పొగడి ఆమె అను గ్రహం కూడా సంపాదించాడు. రాధిక కూడా తన సీనియరు అమ్మాయిల దగ్గర మురళీధర్ చాలా తెలివైన వాడని విని ఉంటుంది. పైగా మురళీధర్ బాగుంటాడు. ఆ అల్లరి కాలేజీలో పెద్ద మను ష్యుల్లా కనిపించే ఏ కొద్దిమందిలోనో అతనూ ఒకడు. అందుచేతనే అనుకుంటాను రాధిక క్రమంగా అతనికి సన్నిహితంగా వచ్చింది. మురళీ చదవటం మొదలు పెట్టాడు. ప్రతి రోజూ నాట్య శాస్త్రంలో ఏవో ప్రశ్నలు వేసే వాడు. ఒక రోజు "నృత్యానికీ నాట్యానికీ భేదం ఏమిటన్నా"డు.

"నాకు ఉద్యోగానికీ, ఉద్యోగ్యానికే భేదం తెలి యదు. తెలుగే సరిగ్గా రాదు" అన్నాను కొంచెం విసుగ్గా.

"ఎందుకోయి విసుగు, నాట్యశాస్త్రం బాగా అర్థం చేసుకుంటే రాధికతో మాట్లాడ్డానికి ఏదో ఒక టాపిక్ అంటూ ఉంటుంది" అన్నాడు.

సాంస్కృతికోత్సవాలలో రాధిక నృత్యం ఏర్పాటు చేసి అది స్వంత పనిలాగా నడిపించి తన కున్న నాట్య శాస్త్ర పరిచయంతో ఆమె నృత్యం పొగిడి ఆమెకి మరింత సన్నిహితుడయ్యాడు. రాధిక కూడా మురళీధర్ మీద ఉన్న ఇష్టం వల్ల డిబేటు వినడానికి వచ్చి అతను మాట్లాడుతూ ఉంటే "బాగా మాట్లాడుతారండీ" అంది అతనితో. ఆ రోజు రాత్రి అతను నిద్రపోలేదని మర్నాడు నాతో చెప్పాడు.

క్రమంగా సాయంత్రాలు నాకు కనపడటం మానేసాడు. కారణం అడిగితే చాలా సేపు తటపటాయించి "రాధికకు నేను ఆమెను ప్రేమిస్తున్న సంగతి చెప్పాను. ఆమె కూడా ఇష్టం కనబరచింది. సాయంత్రాలు రాధికతో గడప వలసి వస్తోంది. ఏమీ అనుకోకు" అన్నాడు సిగ్గు పడిపోతూ ! దానికి నేను అతని బుజం తట్టి ఏమీ అనుకోనని అసలు మురళీధర్ విజయమే నా విజయంగా భావించి గర్విస్తున్నానని చెప్పాను.

రాధిక మురళీధర్‌ని ఒక్కడ్నే ప్రేమిస్తోందేమో కాని, ఆమెను మాత్రం మురళీధర్ ఒక్కడే కాక కాలేజీలో మరి కొంత మంది ప్రేమిస్తున్నారు. నాంచారి వాళ్ళ పెద్ద అందమైన వాళ్ళ కాక పోవడం చేత రాధికకున్న గ్లామర్ లేక పోవటం చేత మురళీధర్‌కి పోటీ లేకుండా పోయింది. కాని రాధిక విషయంలో పోటీదారులు ఏర్పడ్డారు. వాళ్ళ రోజురోజుకీ పెరుగుతున్న వీళ్ల పరిచయాన్ని చూచి అసూయాగ్రస్తులవుతున్నట్టు నాకు చూచాయగా తెలిసింది. ఒకటి రెండుసార్లు మురళీధర్‌ని హెచ్చరించాను. "ఏనుగని చూసి ఎన్ని కుక్కలు మొరిగి ఏం చెయ్యగలవు. వాళ్లెంత మంది ఉన్నా రాధిక నాది. రాధికకు నేను తప్ప ఇంకెవరూ అక్కర్లేదు. నా గురించి నువ్వు అనవసరంగా బెంగ పెట్టుకోకు" అని ఆప్యాయంగా చూసి నవ్వేసాడు.

ఒక రోజు కాలేజీకి వెళ్ళేసరికి కొందరు చేరి రాధిక చాలా బాగా పాడుతుందని ఎలాగైనా డ్రమెటిక్ ఎసోసియేషన్ వాలెడిక్టరీకి పాడించమని సలహాలు ఇస్తున్నారు. రాధికను అడిగి చెప్తానని మురళీధర్ వాళ్ళని పంపించేశాడు. ఆ రోజు సాయంత్రం మురళీధర్ కనిపిస్తే ఏమయిందని అడిగాను కుతూహలంగా.

"నా మొహం నేను పాడ్డం ఏమిటండీ ?" అని నవ్వేసింది" అన్నాడు.

. . . . అయితే 'పాడలేదేమో" అన్నాను.

"అనవచ్చును" అన్నాడు నాతో ఏకీభవిస్తూ.

మర్నాడు ఆ మాటే వాళ్ళతో చెప్పాడు. "లేదండీ. ఆవిడ అల్లాగే అంటారు. చాలా బాగా పాడతారండీ. మేము పూర్వం ఆవిడ పాట విన్నాము. అందుకే అంతగా చెప్తున్నాము. ఆవిడ ఎప్పుడో కాని పాడదు అప్పుడు కూడా ఎవరో తెలిసిన వాళ్ళు బలవంత పెడితే కాని పాడారు కాదు." అన్నారు.

"మీ రడగ మన్నట్టు అడిగాను. ఆవిడ పాడనంది. నన్ను ఇప్పుడు ఏం చెయ్యమంటారు." అన్నాడు మురళీధర్ కొంచెం విసుగ్గా.

"ఎందుకుగా. ఆయన్ని అంత ఇబ్బంది పెడతారు. ఆయనకి ఆవిడతో అంతపరిచయం లేదేమో" అన్నాడు ఒకడు.

"పోరా నీకేం తెలుసు. ఆయనంటే ఆవిడకు చాలా గౌరవం. ఆయన పాడమని అడిగితే చాలు పాడుతుంది" అన్నాడు మురళీధర్‌ని మొహమాట పెడుతూ !

"మీరంతా ఉండండి గొడవ చెయ్యకుండా" అని మిగతా వాళ్ళని కోప్పడి

"అబ్బే ఏం లేదండీ ! ఆ రోజు అవిడ కూడా వస్తారు కదా ! మీరు ఆవిడని పాట పాడమని మైకులో కోరండి." అన్నాడు ఒకడు మార్గం చూపిస్తూ.

"ఆవిడ ఏమన్నా అనుకుంటుందేమో" అని నసిగాడు మురళీధర్.

"ఏమనుకోదండీ. పైగా మీరు నిండు సభలో పాడమని కోరితే కాదనదు. మీమీద ఆవిడకు చాలా గౌరవం." అన్నాడతను.

దాంతో మురళీధర్‌కి గర్వం వచ్చింది. తనని రాధిక ఎంత గౌరవిస్తుందో అందరికీ తెలుసునన్నది అతన్ని ఉత్తేజపరచింది. దాంతో "అల్లాగే" అని వాళ్ళను పంపించేసాడు.

"మురళీధర్‌గారి దయవల్ల మనకు రాధిక గారి పాట వినే అవకాశం మళ్లీ కలుగుతోందని" చాలా సంతోషంగా వాళ్ళ వెళ్లిపోయారు.

వాళ్లను వెళ్లనిచ్చి "చాలా తొందర పడ్డావోయ్." అన్నాను.

"నీదంతా వట్టి భయమోయి ! నా మాట రాధిక కాదనదు. అయినా ఇంకోసారి అడుగుతాలే" అన్నాడు.

మర్నాడు మురళీధర్‌ని అడిగాను ఏమైందని. మురళీధర్ ఆమెను అడిగాడుట కాని 'మీకు తెలియదు వద్దండీ' అందిట రాధిక.

"నిజంగా పాడలేదేమో అల్లా అనలేక ఇల్లా అందేమో" అన్నాను.

"నా దగ్గర పాడలేనని చెప్పటానికి అంత భయపడుతుందంటావా డాన్సు చేసే వాళ్లకి పాట రాదంటావా ? సిగ్గేమో అనిపిస్తోంది" అన్నాడు. నలుగురిలో డాన్సు చేసే రాధికకు నలుగురిలో పాడటానికి సిగ్గుపడుతుందని నాకు అనిపించలేదు.

కాని మురళీధర్ ఆ నిర్ణయానికి వచ్చాక అతన్ని మార్చటం కష్టం. వాలెడిక్టరీ ఫంక్షనుకి రాధిక వచ్చి ముందు వరుసలో కూర్చుని

39 వ పేజీ చూడండి



"అందుకేనే నా బంగారుతల్లీ ! నలుడో, భీముడో అనిపించుకున్న—, వంట నేర్చుకున్న భర్తను చేసుకోమన్నాను...విన్నావా మరి?"



# ఆధునిక జీవితంలో హోటళ్లు— వాటి ప్రభావం వాటి స్థానం

— రాధారాఘవ్



హోటళ్లు . అనేసరికి మనలో చాలా మందికి ఏబుచ్చమ్మ కాఫీ హోటలలో, లేక వీధి చివర ఉన్న అయ్యారు హోటళ్లో జ్ఞాపకం వస్తాయి. కాని నేను చెప్పబోయేది యీ రకం హోటళ్ల గురించి కాదు. ఎందుకంటే యించుమించు ప్రతి ఒక్కరికీ యీ బాపతు హోటళ్ల విషయం సుపరిచితమైనదే. ఇంకా పోగా ఆధునిక సౌకర్యాలతో వీటన్నిటిని అధిగమించి ఒక మెట్టు పైకి వెళ్ళిన హోటళ్లను గురించి తెలుసుకుందాం.

పూర్వపు రోజుల్లో హోటళ్లు అంత సదుపాయకరంగా ఉండేవికావు. కాని, రాను రాను వాటి ప్రాముఖ్యత అధికమవుతోంది. వాటి విలువ ఎక్కువవుతోన్న కొద్దీ, వాటి సౌకర్యాలు కూడ అభివృద్ధి చెందుతున్నాయి. నేటి రోజుల్లో ఒకదానిని మించి ఒకటి ఎన్నో గొప్పగొప్ప హోటళ్లు వెలిశాయి, వెలుస్తున్నాయి కూడ.

హైద్రాబాదులో : బృందావన్, న్యూతాజ్, మద్రాసులో : దశప్రకాశ్, న్యూ ఉడ్‌లాండ్సు, బొంబాయిలో : తాజ్, కలకత్తాలో : ఫిర్పోస్, గ్రాండ్ స్పెన్సర్స్, ఢిల్లీలో జన్పథ్, ఇంపీరియల్ మొదలైనవి ఎన్నో రకాల పెద్దపెద్ద హోటళ్లున్నాయి. ఇవన్నీ ఉన్నతమైన హోటళ్లేగాని సామాన్యులకు అందుబాటులో లేవు.

ఢిల్లీలో జన్పథ్, అశోకా మొదలైన హోటళ్లను గవర్నమెంటు నడుపుతోంది.

మన దక్షిణాదిన పెద్దపెద్ద పట్నాలలో సైతం కొన్ని హోటళ్లయినా సామాన్యులకు అందుబాటులో ఉంటాయి. ఉత్తరాదిన అలా కాదు. ధనవ్యయము చాలా అయ్యే హోటళ్లు ఒకరకం, రోడ్డు ప్రక్కల పెట్టి ఉండేవి ఇంకొకరకం. బాగా డబ్బున్న వారు గాని, ఈ మొదటి రకం హోటళ్లకు వెళ్లలేరు. రోడ్డ ప్రక్కన పెట్టి ఉండే వాటి దగ్గరకు వెళ్లి కొనుక్కుతినడం అంటే మనవైపు అవమానంగా భావిస్తాం. కాని ఇటు వైపు వాళ్లు, పెద్దపెద్ద ఆఫీసర్లు సైతం, కార్లు ఆపి వచ్చి కొనుక్కుతినేస్తుంటారు.

ఆధునిక జీవితంలో హోటళ్ల ప్రాముఖ్యం అంతులేనిది, వాటి విలువ అపారమైనది, వాటి స్థానం అత్యధికమైనది—అని చెప్పడానికి ఏమీ సందేహ పడనక్కర్లేదు. ఈ రోజుల్లో హోటళ్లు ఎన్నో విధాల మనకు సహాయకారులుగ ఉంటున్నాయి. కళ్లెంలేని గుర్రంలా కాలం పరుగెడుతోన్న ఈ రోజుల్లో, టైము, అవకాశం కలిసివచ్చేలా, ఇవి మనకు ఎన్నో విధాల దోహదాన్ని కలుగ జేస్తున్నాయి.

ముఖ్యంగా ఈ హోటళ్లను బ్రహ్మచారుల పాలిట, అత్తారిళ్లు అని చెప్పవచ్చు. భార్యలు పుట్టింటికి వెళ్లినప్పుడు, ఇంటి ఇల్లాలు అనారోగ్యంతో మంచం ఎక్కినప్పుడు, ఏవైనా క్రొత్త ప్రదేశాలకు వెళ్లినప్పుడు, ఇలాంటి కొన్నికొన్ని సమయాలలో ఆపద్బాంధవులలా దర్శనమిచ్చి, బంధు మిత్రులకంటె ఎక్కువగా ఆదుకునేవి ఈ హోటళ్లే. ఇవి మనకు కామధేనువులు, కల్పవృక్షాలు అని చెప్పడంలో కూడ అతిశయోక్తి లేదేమో ?

ఇది వరకు యాత్రలకు వెళ్లాలీ అంటే మన వాళ్లకు బ్రహ్మ ప్రళయం అయేది. భోజనం అగాయితు పడక వరకూ వెతుక్కోవాల్సిన సమస్య ఎదురయేది. తమ కూడా వంటసామాన్లు పట్టుకెళ్లి, అక్కడక్కడ ఆగి వంటలు చేసుకునే వారు. కాని ఇప్పుడలా కాదు. రోజులు మారాయి. ఎక్కడ చూసినా, ఆధునిక సౌకర్యాలతో ఉన్న హోటళ్లు ఆహ్వానిస్తున్నాయి. చిన్న బేగ్‌లో రెండు బట్టలు వేసుకు వెళ్లితే చాలు. ఎంత దూర యాత్రయినా చేసెయ్యవచ్చు. ఎన్ని ప్రదేశాలైనా చూసిరావచ్చు. స్నానం అగాయితు అన్నీ ఈ హోటళ్ల పుణ్యమా అంటూ ఎంతో సుఖంగా నిర్వర్తించేయవచ్చు. పగలంతా తిరిగి, అన్నీ చూసి, హోటలుకొచ్చి హాయిగా భోజనం చేసి విశ్రాంతి తీసుకోవచ్చు.

ఇంక ఏవైనా పార్టీలు ఇవ్వాలన్నా, ఏది చేయాలన్నా ఇంట్లో అన్ని సదుపాయాలూ అమర్చాలీ అంటే కొంచెం ప్రయాసతో కూడిన పని. తిరిగి అన్ని ఏర్పాట్లు చేసుకునేసరికి, గృహిణి పని మూడు వంతులయిపోతుంది. ఇంక పోనీ అన్నీ చక్కగా తయారు చేయబడ్డాయా అంటే అదీ చెప్పలేము. ఎప్పుడు, ఏ క్షణంలో, ఎక్కడే లోటు పాటొస్తుందో నన్న భయంతో, ఒకవైపు నుంచి గృహిణి గుండెలు అదురుగానే ఉంటాయి.

—ఈ శ్రమ అక్కర్లేకుండా, హోటళ్లు మనకు ఎంతో తోడ్పడుతున్నాయి. వీరి పుణ్యమా అంటూ చక్కటి డిన్నర్లు, టీ పార్టీలు మనం అతిథులకు సమర్పించవచ్చు. ఎంత మంది అతిథుల నాహ్వానించినా, వారి మర్యాదల గురించి మనం అదుర్దా పడాల్సిన అవసరం లేదు. అలసి పోకుండా శ్రమ అక్కర్లేకుండా, అతిథులతో పాటు మనం కూడ హాయిగా వెళ్లిరావచ్చు. ఇలా ఆధునిక జీవితంలో హోటళ్లు మనకు అనేక విధాల ఉపయోగింపబడుతున్నాయి.

ఒక విధంగా ఈ హోటళ్లు దేశ ఔన్నత్యానికి మూలాధారాలని చెప్పడంలో కూడ తప్పేమీ లేదనుకుంటాను.— హోటళ్లలో సౌకర్యాలు ఎక్కువయితే, ప్రతి వాళ్లకు దేశం నలుమూలలా పర్య

వనితాలోకం 'ప్రత్యేక వ్యాసావళి' లో ఎనిమిదవ వ్యాసం

టించి, ప్రాముఖ్యమైన ప్రదేశాలన్నీ చూడాలనే కోర్కె బయలు దేరుతుంది. అప్పుడు వినోద యాత్రికుల ద్వారా మన దేశానికి వచ్చే ఆదాయం కూడ అధిక మవుతుంది.

దేశంలో ఉన్న హోటళ్ళ సంఖ్యను బట్టి కూడ, ఆయా దేశాలు ఎంత పురోభివృద్ధి గాంచినవో చెప్పవచ్చు. అంటే.... ఇంకా వృద్ధి అవని దేశాలు ఉన్నాయా అంటే అక్కడ హోటలు సౌకర్యాలుండవు. అప్పుడు టూరిస్టులు వచ్చే అవకాశం ఉండదు.

ఈ రోజుల్లో ఎంతో మంది విదేశస్థులు మన దేశాన్ని పర్యటించడానికి వస్తూంటారు. వారు దేశం నలుమూలలా తిరుగుతూ, మన దేశంలో ఉన్న ముఖ్యమైన చరిత్రాత్మక స్థలాలను, ప్రసిద్ధికెక్కిన కట్టడాలను, 'శిల్పాలను, ఆలయాలను దర్శిస్తూ హోటళ్ళలో దిగుతూంటారు.

అటువంటి వారికి, ఏ లోటుపాట్లూ లేకుండా, సమస్త సౌకర్యాలూ కల్పించబడిననాడు వారు ఎంతో సుఖంగా తమ పర్యటన ముగిస్తారు. ఎంతో తృప్తితో వారిదేశం వెళ్ళి, మన దేశం గురించి, మన ఆచార వ్యవహారాలను గురించి, ఇప్పటి సౌకర్యాలను గురించి ఘనంగా చెప్పగల్గుతారు. ఇవన్నీ వింటూన్న వారిలో, తాము గూడ పర్యటించాలనే కోరికను రేకెత్తిస్తాయి. అప్పుడు మన దేశాన్ని పర్యటించడానికి వచ్చే విదేశస్థుల సంఖ్య అధిక మవుతుంది. ఈ రకంగా కూడ హోటళ్ళు, మన దేశానికి టూరిస్టుల ద్వారా వచ్చే ఆదాయాన్ని అధికం చేయడానికి ఎంతో తోడ్పడుతున్నాయి.

నేటి రోజుల్లో ఆధునిక గృహాల మీద ఈ హోటళ్ళ ప్రభావం చాలా ఎక్కువగా కనిపిస్తోంది. అంతవరకూ చదువుసంధ్యల్లో మునిగి ఉన్న అమ్మాయిలు హఠాత్తుగా పెళ్ళి చేసుకుని, కాపరం కొచ్చేసరికి వంట సరిగ్గా చేయలేక పోతున్నారు. వీళ్ళ వచ్చీ రాని వంటలు తిని, తృప్తి పడలేని భర్తలు హోటళ్ళకు దారి తీస్తున్నారు. ఈ హోటళ్ళకు వెళ్ళడం ఎలా మానిపించాలి ? హోటళ్ళలో మాదిరిగా వంటకాలు ఇంట్లో ఎలా చెయ్యాలి ? భర్తలను సంతృప్తి పరచడం ఎలా? అని సతమతమవుతోన్న గృహిణి, హోటళ్ళలో మాదిరి వంటలు చేయడానికి ప్రయత్నిస్తోంది. ఈ విధంగా, స్త్రీలకు క్రొత్త రకాల వంటలు చేయడంలో కుతూహలాన్ని, ఆసక్తిని రేకెత్తిస్తున్నాయి.

కొన్ని కొన్ని హోటళ్ళు ఎంతగా అభివృద్ధి చెందాయా అంటే, బటన్ నొక్కితే చాలు. అన్నీ కాళ్ళ దగ్గరకొచ్చి అమిరేటంత సులువై పోయాయి.

టెలిఫోను సౌకర్యాలతో ఎయిర్ కండిషన్డు రూములు, కార్లు పెట్టుకోడానికి గేరేజస్, ఎక్స్‌కర్షన్లకు వచ్చేవారికి, టీపార్టీలు ఇచ్చుకునే వారికి ఎంతో విశాలమైన హాలులు, చలికాలంలో స్నానానికి వేడినీళ్ళు చన్నీళ్ళ వసతి, లాన్సు.... ఒక్కటేమిటి ?— అనేక సౌకర్యాలు అమర్చి ఉంటున్నాయి. బెడ్‌లినెన్ ఏ రోజు కారోజు మార్చేస్తారు. షాపింగు అంతా క్రిందే ఉంటుంది. డ్రైక్లీనింగు, సెలూన్సు అన్నీ అక్కడే అమర్చ బడి ఉంటున్నాయి. విదేశాలకు గాని, మరింక ఏ ఇతర ప్రదేశాలకు గాని ఎక్కడకు వెళ్ళాలన్నా, వేరే బయటకు వెళ్ళాల్సిన అవసరం లేకుండా టిక్కెట్టు బుకింగు ఇక్కడ్నించే జరుగుతుంది.

కాన్ఫరెన్సులు, గేదరింగులు, శాస్త్రజ్ఞులు పెట్టుకునే కొన్ని మీటింగులు, రిసెప్షన్లు కొన్ని హోటళ్ళలో పెట్టుకోడానికి అవకాశం కూడ ఉంది.

అనేక మంది పారిశ్రామికవేత్తలు వ్యాపార వ్యవహారాల రీత్యా వస్తూంటారు. వీరు ఆ విషయాలు మాట్లాడుకోవాలన్నా, మిగతా వారి సందర్శి కలుసుకుని పార్టీ లిచ్చుకోవాలన్నా ఈ హోటళ్ళలోనే అవకాశం కల్గుతోంది.

## రచయిత్రి గురించి...

'వ్యక్తిత్వం' అనే వ్యాసం ఆ మధ్య మా పత్రికలో చదివే వుంటారు. ఈ వ్యాస రచయిత్రి శ్రీమతి రాధా రాఘవ్, ప్రస్తుతం ఢిల్లీలో వుంటున్నారు. జీవిత విశేషాలు ఫొటో పంపమని ఆమెను అడిగాము. ఆమె ఈ "వ్యాసంతో పాటు" యిలా రాశారు. "నా ఫొటో జీవిత విశేషాలు పంపమన్నారు. నేను వ్రాసిన వ్యాసాలు కథలు, నవలలు అయితే చాలా వ్రాసే వున్నాయి గాని అచ్చయినవి చాలా తక్కువండీ! కనుక అప్పుడే ఫొటో పడటం బాగుండదనిపిస్తోంది..."

అయితే రచయిత్రి కథలు వ్యాసాలు 'పత్రిక'లలో అచ్చు కాకపోలేదు. మా పత్రికకు వీరు సుపరిచితులే.

విదేశస్థులు మనదేశం వచ్చినప్పుడు, మిగతా వారి స్వదేశీయుల్ని కలుసుకోవాలంటే, హోటళ్ళలో పార్టీలిచ్చుకుని కలుసుకోడానికి వీలుగా ఉంటుంది.

సాధారణంగా కొన్ని పెద్దపెద్ద హోటళ్ళకు మనవైపున టెర్రెస్ గార్డెన్సు, ఉత్తరాదిన లాన్సు ఉంటాయి. చలికాలం ఎండకోసం ఉత్తరాది వారు టెర్రెస్‌మీద చక్కటి ఏర్పాట్లు చేస్తారు. ఒక నేల స్థలం గనుక లేనట్లయితే, లాన్సులోనే టేబుళ్ళు వేసి అల్పాహారాల్లాంటివి సర్వ్ చేస్తారు.

కొన్ని కొన్ని హోటళ్ళలో స్విమ్మింగ్ పూల్స్ కూడ ఉంటాయి. హోటళ్ళలో కొన్ని రోజులుండే వారి కొరకు, వారు ప్రత్యేకించి క్లబ్బులకు వెళ్ళనవసరం లేకుండా కొన్ని ఇండోర్ గేమ్సు ఉంటాయి. ఆర్కెస్ట్రా, నృత్యాలు, లైట్ మ్యూజిక్ లాంటి ఏర్పాట్లు ఉంటాయి.

కొన్ని పెద్దపెద్ద హోటళ్ళలో ఒక రోజు ఏ ఈజిప్షియన్ గర్ల్స్ డాన్సో పెడ్తారు. ఇంకో రోజు ఒక ప్రసిద్ధ వాయిద్య విశేషం ఉంటుంది. వాటివల్ల ఇతర ప్రదేశాలలోని కళాకారులను దర్శించే అవకాశం కూడ ఈ హోటళ్ళ ద్వారా లభిస్తోంది.

విదేశీయులకు ఆహార పదార్థాలలో కూడ, మన హోటళ్ళ వారు, ఆయా దేశాల వంటకాలు తెలిసిన వారిని గాని, లేక అవి నేర్చుకుని, ఇక్కడ తయారు చేయించే ఏర్పాట్లు గాని చేసి, ఆయా వ్యక్తులకు వారివారి ఆహారాన్ని ఇవ్వగల్గుతున్నారు. అందువల్ల ఇతర దేశాల ఆహార పదార్థాల తయారీ నేర్చుకోడానికి హోటళ్ళు తోడ్పడుతున్నాయన్న మాట. మన తందూరీ చికెన్, విదేశాలలో ఎంత పాప్యులర్ డిష్ అయి పోయిందో అందరికీ తెలిసిన విషయమేగా.

మరి కొన్నికొన్ని హోటళ్ళలో కారిడార్స్‌లోను, గేలరీస్‌లోను మన దేశ ఔన్నత్యాన్ని తెలియచేసే కళలు— చిత్రాలు, శిల్పాలు, ఫోటోలు పెడుతూంటారు. వీటివల్ల మనదేశాన్ని పర్యటించడానికి వచ్చే విదేశీయులకు తాము చూడాల్సిన స్థలాలు, విశేషాలు తెలుసుకోడానికి కొంత వీలవుతుంది.

హోటళ్ళ ద్వారా క్రొత్తవారితో పరిచయాలు కలిగే అవకాశాలు కూడ ఉన్నాయి. ఢిల్లీలాంటి ప్రదేశాలలో, హోటళ్ళలో ఉన్నామూ అంటే, అనేక రకాల ప్రదేశాల నుంచి వచ్చే మనుష్యులు కనిపిస్తూంటారు. అలాంటి సమయాలలో ఒకరితో ఒకరు పరిచయాలు కల్పించుకుని, ఒకరి ఆచార వ్యవహారాల గురించి మరొకరు తెలుసుకోవచ్చు.

ప్రతి దానికి మంచి, చెడు ఎలాగైతే ఉంటాయో, అలాగే ఇన్ని సౌకర్యాలు కల్పిస్తూండే హోటళ్ళతో పాటు చీడపురుగుల్లాంటి హోటళ్ళు కూడ అక్కడక్కడ కొన్ని తటస్థ పడుతూంటాయి మనకు.

కొన్ని సామాన్యమైన హోటళ్ళలో కేవలం ధన సంపాదనే ప్రధానోద్దేశ్యంగా పెట్టుకుని, చవకలో అయే ఆహార పదార్థాలతో, శుచి శుభ్రం లేకుండా ఉంచుతారు. ఇలాంటి చోట్ల అవసరం గడుపుకోడాన్కి ముక్కు, కళ్ళు మూసుకుని ఉండాల్సి వస్తుంది.

ఉత్తరాదిన కొన్ని మామూలు హోటళ్ళలో సర్వర్లు ఎంగిలి ప్లేట్లు తీసిన చేతులతోటే సెర్వ్ చేసేస్తూంటారు. చూసీ చూడనట్లు ఊరుకోవడం తప్పించి ఇంకేం చేయలేము.

కొన్ని హోటళ్ళు చూశాక, అంతకంటె వేరే నరకం ఏమీ ఉండదనిపిస్తుంది. ఇలాంటి వాటివల్ల ఆ ప్రదేశాలు చూడాలన్న కోర్కె కూడ నశిస్తుంది.

మొట్ట మొదటసారి మేము ఆగ్రా వెళ్ళినప్పుడు మా వారు దగ్గర లేరు. చాలా ఘోరంగా మోస పోయాము మేము. రైలు దిగిన వెంటనే, వెంట పడి, తెలుగులో మాట్లాడుతూ, స్టేషనుకు, అతి సమీపంలోనే మంచి హోటలుందని, మద్రాసు భోజనం ఇస్తారని, ఎన్నో విధాల చెప్తూ ఒకతను

కూడా వడ్డాడు. పోనీ ఇంతగా ప్రాధేయపడుతున్నాడు, ఏదైతే ఏం పోయిందని వెళ్లాం. పైకైతే ఆ హోటల్ చూడ్డానికి బాగానే ఉంది. కాని లోపలంతా కూపం. గట్టిగా గెంటితే ఊడిపోయేలా ఉన్నాయి తలుపులు. భయంకరమైన గదులు, విరగడానికి రెడీగా ఉన్న ఫర్నిచరు, గదుల్లో స్వేచ్ఛావిహారం సాగించే మూషికాలు, రుచీపచీ లేని ఆహారపదార్థాలు. అందులో కొన్ని పాచివాసన వచ్చినవి. డబ్బు చూస్తే చాలా ఎక్కువ తీసుకున్నారు. ఆ హోటల్ యజమాని, ఈ బ్రోకరు, ఊరి విశేషాలు చూపించడానికి వచ్చే గైడు, అక్కడి కొందరు టాక్సీలవాళ్లు, టాంగాల వాళ్లు—వీళ్లంతా ఒక గ్రూపు. ప్రతి దానిలోను మోసం చేయడమే. సాలెగూడులో చిక్కినట్టయింది.

తాజ్ మహల్ ప్రపంచ విఖ్యాతిగాంచింది. ఎందరో విదేశీయులు దీనిని చూడటానికి మన దేశం వస్తూంటారు. వీరు గనుక ఇలాంటి హోటళ్లలో, ఇటువంటి రకం మనుష్యుల బారిన పడడం తటస్థిస్తే వారికి ఎంతో అన్యాయం చేసినట్టవుతుంది. ఇలాంటి వారివల్ల విదేశీయులకు ఎలాంటి మోసాలు జరుగకుండా చూడాల్సిన బాధ్యత మన ప్రభుత్వం వారిది.

ఒక విధంగా మనదేశపు సాంప్రదాయానికి, నాగరికతకు సభ్యతకు, సంస్కారానికి ప్రతిబింబాలు ఈ హోటళ్లు. వీటిని ఇంకా ఎంత తీర్చి దిద్దితే అంత ప్రయోజనం మన దేశానికి.

# వనితా వాణి

## మహిళా ప్రగతి

పశ్చిమ గోదావరి జిల్లాలోని పొదలాడ పంచాయితీ బోర్డులో గల మొత్తం ఏడు స్థానాలకు ఇటీవల జరిగిన ఎన్నికలలో అందరూ మహిళలే ఎన్నికయారు. 1959తో ఏర్పడిన ఈ పంచాయతీకి ప్రారంభం నుంచి ఏకగ్రీవంగానే ఎన్నికలు జరగటం, ప్రతిసారీ అధ్యక్షస్థానానికి శ్రీమతి మాడభూషి జయలక్ష్మి ఎన్నిక కావటం విశేషం. ఈసారు ఎన్నికయిన సభ్యురాండ్రు శ్రీమతులు జయలక్ష్మి (సర్‌పంచ్), మామిడి మంగమ్మ (ఉపసర్‌పంచ్), పి. భూదేవి, కేతా సూరమ్మ, సి. చిన వెంకమ్మ, జి. పల్లమ్మ, డి. మంగమ్మగారలు. పొదలాడ పెనుగొండ సమితి లోనిది.

అన్ని స్థానాలకు మహిళలకే అవకాశాలిచ్చిన పొదలాడ ప్రజలు ఒక కొత్త ఆదర్శాన్నే నెలకొల్పారని చెప్పుకోవచ్చును.

## కొత్తశీర్షిక

వనితల ప్రత్యేక వ్యాసావళి శీర్షికలో రెండు చదివాక చదువరులకు మీరు బహూమతించిన రత్నాలే అనిపించింది. కాని శ్రీమతి కృష్ణకుమారిగారు ఏం పని చేస్తున్నారో తెలుపలేదు. అసలు వనితలకు ప్రత్యేకం అంటే ఏదో కుట్లు—కూర్పులో లేక వంటా—వార్పూ, ఏదీ కాక కాగితంతో రోజా పూలు, గవ్వల బొమ్మలో లాగావో ఏవో వ్యాసాలు ప్రచురించెదరని ఆశించాను. కాని ఎంతో విజ్ఞానాన్నిచ్చే ఈ అమూల్య రత్నాలు బహూకరిస్తారని వూహించనైనా లేదు. మా ధన్యవాదాలు. కాని మేము ఆశించే వ్యాసావళి కూడా వనితల సహకారంతో ప్రచురిస్తారని ఆశిస్తున్నాం.

అన్నపూర్ణ, రాణి (నెల్లూరు)

## వంట సామగ్రి

నవీన వంట పరికరాలు పెద్ద పట్నాల్లో దొరుకుతాయి కాని చిన్న వూళ్లల్లో దొరకవు. షాపుల వాళ్లకీ తెలియవు, ఎలక్ట్రికల్ అప్లయన్స్ వాడటానికి వేరే నవరు లైను ఉండాలి. లేకపోతే ఖర్చు విపరీతముగా అవుతుంది. ఇలాంటి నదుపాయాలు పట్నాల్లోనే ఉంటాయి. ఏమైనా పట్నాల్లో ఉండి ఈ ఆధునిక పరికరాల గురించి తెలియని వనితలకు హేమలతా కైలాసంగారి వ్యాసం చాలా ఉపయోగ పడుతుంది.

సి. లక్ష్మిరావు (ఎర్నాకులం)

## మన ఆహారం

వనితాలోకం ప్రత్యేక వ్యాసావళిలో ఐదవ వ్యాసం "మన ఆహారం"పై విశాఖగారి వ్యాసము మమ్మలను ఉత్తేజపరచినది.

వ్యాసం ముగింపులో రచయిత్రి "కుటుంబంలో వారి రుచులకి అనుగుణంగా తన చాకచక్యంతో ఆహార పద్ధతులలో వైవిధ్యాన్ని చూపుతూ, బలమైన ఆహారాన్ని రుచిగా శ్రద్ధతో వండిపెట్ట గలిగిన యువతి మన ఆధునిక యువతి" వ్రాసిన విధంగా ప్రతి యువతి తమకు తాము అనుసరించిన చాల బాగుండునని మా కోరిక. ఎవరి తాహతు బట్టి వారు అలా అనుసరించవలెను—

గుంటూరు కల్యాణి (అప్పికట్ల)

* * *

19—6—64 సచిత్ర వార పత్రికలో 'మన ఆహారం' వ్యాసము చాలా బాగుంది. ఆహారము లోకి రోజూ ఏమి చెయ్యవలయునా అను సమస్యగా ఉంటుంది. విశాఖగారు వ్రాసినట్లు తిన్నవే తింటే విసుగు వేస్తుంది.

పి. సుబ్బలక్ష్మి (కె. సి. వర్కున్స్)

* * *

శ్రీమతి విశాఖగారి 'మన ఆహారం' వ్యాసం చాలా బాగుంది. వారు చెప్పిన ప్రతీమాట నిజంగా తోస్తుంది. మా పిల్లలు (8 సం. దాదాపు) పెరుగు, చారు తప్ప వేరే పదార్థం తాకరు. ఇప్పుడు అన్నీ తినడం అలవాటు చేసుకోవలయునని బోధిస్తున్నాం. ప్రయత్నిస్తున్నాం. విశాఖగారు గృహిణులకు సంబంధించిన ఇలాటి వ్యాసాలు ఇంకా వ్రాస్తారని ఆశిస్తున్నాము.

కామసముద్రం జయలక్ష్మి,
బాణగిరి విజయలక్ష్మి (కర్నూలు)

## యువతీ యువకులు

శ్రీమతి ఆనందారామంగారు, నేటి సాంఘిక వ్యవస్థకి వివాహము సరిపడదని వ్రాశారు. నేను కూడా వారితో ఏకీభవిస్తున్నాను. ఇకముందుకూడా ఇటువంటి మంచి వ్యాసాలే ప్రచురించ గోర్తాను.

వి. కామాక్షి (కడప) ★




### జరిగిన కథ

మధు, స్నేహితురాలు శారదకు తన బాల్యగాథను చెప్పగా, ఆమె దాన్నంతా నవలగా చిత్రిస్తుంది ... చిన్ననాటనే తల్లిని కోల్పోయిన మధు తండ్రికి కూడా దూరమవుతాడు. తాతగారింట్లోనే అష్టైశ్వర్యం, వైభవాలతోను వుంటూవుండగా, జమిందారుగారి ఇద్దరు కూతుళ్ళ స్నేహం లభిస్తుంది. తాతగారి మరణంతో మధు తాతగారి సొంత వూరు చేరాడు. అక్కడి పరిస్థితులు మధుకు బాధాకరంగా ఉంటాయి. జానకిభర్త మనసు మారినందుకు అంతా సంతోషిస్తారు. మామయ్యకు ఇష్టంలేకపోయినా, మధు స్కూల్లో చేరతాడు. హెడ్ మాస్టరు మధు ప్రతిభను చూసి సంతోషిస్తాడు. విశ్వనాథం మధును సతాయించటాన్ని సుందరమ్మగారు ప్రతిఘటిస్తుంది. అంతేకాదు, మధుపట్ల నానాటికి విశ్వనాథానికి ద్వేషం పెరిగిపోవటం, సుందరమ్మగారికి బాధాకరంగా పరిణమిస్తోంది.

## 10

వారం రోజులనుంచీ వూరంతా హడావుడిగా ఉంది. సినిమాలు చూపించటానికి డేరా హాలు వేస్తున్నారు. అందరి గోడలకూ సినిమా బొమ్మలు అంటించారు. పిల్లలందరికీ కాయితాలు పంచిపెట్టారు. గ్రామఫోను ఒంటెద్దు బండిలో పెట్టుకుని పాటలు పాడిస్తూ వూరంతా తిప్పుతున్నారు. వూరంతా ఒకటే సందడిగా ఉంది. ఆ రోజునుంచే సినిమా చూపించటం మొదలు— "రాక్షసుల రాజ్యం" సినిమా బొమ్మలు గమ్మత్తుగా ఉన్నాయి. రాజ కుమారుడు గుర్రంమీద ఎక్కి వెళ్తున్నాడు. దారిలో ఒక రాక్షసుడు అడ్డం వచ్చాడు. ఆ రాక్షసుడితో రాజకుమారుడు గొప్పగా యుద్ధం చేస్తున్నాడు— ఓ బొమ్మలో —

రాక్షసుడు తప్పించుకు పారిపోతోంటే రాజకుమారుడు వెనకాలే గుర్రంమీద తరుముతున్నాడు— మరో బొమ్మలో.

దారిలో ఒక అందమైన అమ్మాయి కన్పించింది. రాజకుమారుడు గుర్రం దిగి ఆ అమ్మాయితో ఏదో మాట్లాడుతున్నాడు. ఆ అమ్మాయి కూడా రాజకుమారిలాగే ఉంది.

ఇంకో బొమ్మలో రాక్షసుడు చచ్చి పడి ఉన్నాడు.

"అరె! రాక్షసుడెలా చచ్చిపోయాడ్రా?"

"రాజకుమారుడూ రాజకుమారీ పెళ్ళి చేసుకుంటున్నార్రోయ్!"

"రాజకుమారుడే రాక్షసుణ్ణి చంపేశాడు రా!"

పిల్లలంతా గోలగా ఎగబడి బొమ్మలు చూశారు.

"ఒరేయ్ మధూ! మనమూ సినిమాకెళ్దాంరా!" గోపాలానికి సినిమా చూడాలని కోరిక పుట్టుకొచ్చింది.

"నాకూ చూడాలనే ఉందిరా గోపాలం! మరి డబ్బులు లేవుగా? బేడ—బేడ కావాలి. ఎవరిస్తారు?"

"నా దగ్గర మూడణాలు ఉన్నాయిరా! ఇంకో అణా ఉంటే మనిద్దరికీ సరిపోతుంది. కదూ?"

"మరి అణా ఎవర్ని అడుగుదాం?"

"మొన్న నీ గొలుసు తీసేసుకుందిగా? మీ చిన్నత్త నడుగు. ఇస్తుంది".

మధుకి నచ్చలేదు— "నే నడగను రా! కాని నువ్వు వెళ్ళి చూసిరా! నేను డేరా బయట నించుంటాను."

గోపాలం ఒప్పుకో లేదు— "పోనీ నువ్వు అడగొద్దులే. మీ చిన్నత్తని నేనడగనా?"

కాస్త బాగానే ఉందనిపించింది ఆ ఉపాయం.

"అయితే అడిగిరా! నేనిక్కడే కూర్చుంటాను."

గోపాలం పరిగెత్తుకుంటూ వెళ్ళాడు— కాస్సేపట్లో తిరిగివస్తూ— "అర్ధణాయే ఇచ్చిందిరా! డబ్బుల్లేవంది." అంటూ అర్ధణా చూపించాడు.

మధుకి కోపం వచ్చింది.— ఆ అర్ధణా పట్టుకుని పరిగెత్తుకు వెళ్ళి దొడ్లో చీడీలమీద బియ్యం ఏరుకుంటూన్న సావిత్రి ముందు గిరవాటు పెట్టాడు. అర్ధణావచ్చి బియ్యంలో పడితే సావిత్రి తలెత్తి చూసింది.

"నాకేం అర్ధణా అక్కర్లేదు. అణా ఇవ్వలేనేమిటి?" మధు క్షణం నిలబడకుండా పరిగెత్తుకు వెళ్ళిపోయాడు.

అయితే ఏంచేద్దాం?— మళ్ళా అణా ప్రశ్న వచ్చి ఎదురుగా నిలబడింది.

"పెదనాన్న వూళ్ళో లేడు. చూస్తే ఇవ్వాళే చూడాలి." అన్నాడు గోపాలం ఆర్తిగా.

మధుకేమీ తోచలేదు.— "పోనీ కాస్సేపు వీధిలోకి పోదాం పదరా!" అంటూ లేచాడు.

తీరా వీధిలో కాలు పెట్టేసరికే తెలుగు మేష్టారు ఎవరితోనో మాట్లాడుతూ కన్పించారు.

ఆయన మధుని గోపాలాన్ని చూడనే చూశారు. —"ఒరేయ్! నాకు కాస్త పని ఉందిగాని ఈ కూరల సంచీ మా ఇంటి దగ్గర ఇచ్చి రండిరా! జాగ్రత్త రోయ్! రోడ్డుమీద ఎత్తెయ్యకండి"— అంటూ నమ్మకమైన విద్యార్థులకో పని అంటగట్టారు.

వాళ్ళిద్దరూ సంచి తీసుకు వెళ్ళేసరికి మేష్టారి భార్య కూరల కోసమే ఎదురు చూస్తోంది.

"హమ్మయ్య! ఇప్పటికైనా తెచ్చారు. అసలు సినిమా అందదనే అనుకున్నాను. మీ మేష్టారు ఎక్కడ పెత్తనాలు చేస్తున్నారేమిట్రా?" — ఒకవేపు మాట్లాడుతూనే సంచి దిమ్మరించి చకచకా వంకాయలు తరుక్కోవటం మొదలుపెట్టిందావిడ.

మధు వినయంగా అడిగాడు— "అమ్మగారూ! మీరు సినిమాకి వెళ్తారండి?"

"అవున్రా! సినిమా బాగుందట గదూ" మా వాడు అప్పుడే వోసారి చూసి మళ్ళాతో వస్తానని గోల చేస్తున్నాడు— మీరు చూశారా?"

"లేదండీ! చూడాలనే ఉందండీ"

"ఇంకా ఉండటం ఏమిట్రా? వెళ్ళక. మీలాంటి పిల్లలే చూడాలి."

మధు వినుగుతూనే అనేశాడు— "మా దగ్గర మూడణాలే ఉన్నాయండీ! ఇంకో అణా....."

"మీ అమ్మమ్మగార్ని అడక్కూడదూ?"

"మా అమ్మమ్మ దగ్గర డబ్బులు ఉండవండీ మా చిన్నత్త నడిగితే ఇవ్వలేదండీ!"

"అయ్యో! అణా భాగ్యానికేనా? అయినా ఆవిడ దగ్గిర ఉన్నాయో లేవో? ఇంద ఈ బేడ తీసుకోండి.' ఆవిడ పోపుల పెట్టెలోంచి బేడబిళ్ళ తీసింది.

"ఒక్క అణా చాలండీ!"

"సినిమాకి వెళ్తున్నారు కదా చిన్నపిల్లలు. ఏమైనా కొనుక్కోరూ?" అంటూ నవ్విందావిడ.

మహా ప్రసాదంలా దోసిలిపట్టి అందుకున్నాడు బేడబిళ్ళని మధు.

"వెళ్ళిపోతాం అమ్మగారూ!"

"ఆఁ ఆఁ వెళ్ళండి. నేను కూడా వండుకోవాలి."

వీధిలోకి వచ్చి మధూ గోపాలం కావిలించేసుకున్నారు. అంతులేని సంతోషంతో మాట్లాడుకోలేక పోయారు.

"పాపం సత్యన్నారాయణని కూడా పిలుద్దాంరా! వాడికి డబ్బులుంటాయిగా?"

"అవును కిష్టిగాడుకూడా. అందరం సరదాగా కలిసి వెళ్దాం."

గోపాలం గుసగుసలాడుతూ సత్యన్నారాయణకి సినిమా కబురు చెప్పేశాడు. వాడి మొహం విప్పారింది.

"ఇప్పుడే మా పిన్నిని అడుగుతాను."— సత్యన్నారాయణ గదిలోకి వెళ్ళాడు. ఏమడిగాడో గానీ పార్వతి మాటలు బైటికి వినపడ్డాయి.

"అమ్మో! వాళ్ళందరితో నువ్వు సినిమాకే! జనం కిటకిటలాడుతున్నారట. అసలే అర్భకం వెధవ్వి! నిన్ను తొక్కేసినా తొక్కేస్తారు."

". . . . . . . . . . ."

"ఎందుకురా అలా మొహం దించుకున్నావ్? రేపు నేనూ, సావిత్రి పిన్నీ వెళ్దామనుకొంటున్నాం— నిన్ను నేను తీసికెళ్తాగా? బెంచీలకు వెళ్తే ఖాళీగా కూర్చోవచ్చు. నేలలో అయితే నువ్వు కూర్చోలేవు."

సత్యనారాయణ చిన్నబుచ్చుకున్న మొహంతో బయటికి వచ్చాడు. పాపం వాణ్ణి చూస్తే జాలేసింది. పలకరిస్తే ఏడ్చేసేలా ఉన్నాడు.

"అసలు నీదగ్గర డబ్బులున్నాయా? లేవా? చెప్పు."

"ఒక్క అణా ఉన్నా చాలు. నా దగ్గిరో అణా ఉంది." మధు, గోపాలం బుజ్జగిస్తోంటే సత్యన్నారాయణ నిజంగానే ఏడ్చేశాడు.

"ఏడవటం ఎందుకురా? చెప్పూ?"

"డబ్బులెందుకు లేవు? నా సంచీలోనే ఉన్నయి"

"అయితే మాతో వచ్చేయ్ రాదూ?"

"మరి మాపిన్ని తిట్టదూ?"

"ఇంకెందుకూ ఏడుస్తావు? నోరు మూసుకు కూర్చో." మధుకి చిరాకు వేసింది.

"తిడితే తిడుతుందిలేరా! సత్యన్నారాయణా! మధు అన్నమాటా దెబ్బలు పడటంలేదా ఏమిటి? నిజంగా మాతో వచ్చెయ్ – రేపు పెద్దవాళ్ళతో వెళ్తే ఏం సరదా ఉంటుందీ? ఎంచక్కా మన మైతే .... అల్లరి చేసుకుంటూ, అరుచుకొంటూ నవ్వుకొంటూ ...."

"వచ్చేస్తానురా నేను." గమ్మున అనేశాడు సత్యన్నారాయణ.

"నిజంగా ?"

"నిజంగానే వచ్చేస్తాను. పెద్దవాళ్లతో ఏం వెళ్తాడేమిటి ?"

"సత్యన్నారాయణ పిరికివాడు కాదురోయ్ !"

సత్యన్నారాయణకి ఏదో ధైర్యం వచ్చేసింది. సంచిలో డబ్బులు తీసి చూపెంచాడు. సరిగ్గా బేడర్ధణా ఉంది— "చాలవూ ?"

"ఓ ! ఇంకో అర్ధణా కొనుక్కోటానికి కూడా మిగులుతుంది.."

ఎప్పటిలాగే పిల్లలు పెందరాడే భోజనాలు చేసేశారు— "చాప వేసుకు కూర్చొని చదువుకో." మరోసారి హెచ్చరించింది పార్వతి. సత్యన్నారాయణ తల తాటించి ఊరుకున్నాడు.

# కూలిన గోడలు

సినిమా మొదలుపెట్టటం ఎనిమిది గంటలకి. సైగలు చేసుకుంటూ, గుర్తులకోసం ఈలలు వేసుకొంటూ వీధిలో పడేసరికి ఏడున్నర దాటింది. సినిమా డేరా దగ్గిర అప్పుడే పాటలు వేసేస్తున్నారు. పిల్లలంతా కాలికొద్దీ పరుగుసేశారు. ఎప్పుడు వచ్చేశాడో కిష్టిగాడు డేరా దగ్గిరే కన్పించాడు.

తెలుగు మేష్టారి పెళ్ళాం కూడా కన్పించింది. గోపాలాన్ని చూస్తూ— "మావాడెటుపోయాడో కన్పించటంలేదు బాబూ! రెండు కిళ్లీలు తెచ్చి పెడతావూ ?" అంటూ అర్ధణా యిచ్చింది.

కృష్ణుడితో సహా నలుగురూ కిళ్లీకొట్టు దగ్గిరకి పరుగెత్తారు.— మనమూ కిళ్లీలు వేసుకుందాంరా !" అన్నాడు కృష్ణుడు మధుతో. సత్యన్నారాయణ కూడా అంగీకరించాడు. అందరూ తలో కానీ యిచ్చి కిళ్లీలు కట్టించుకున్నారు.

"బాగా కట్టు అబ్బీ ! ఎర్రగా పండాలి."

"పండకపోతే యింకో కిళ్లీ యివ్వాలి. తెలిసిందా?

"అర్ధణాకి మూడైనా ఇవ్వవూ ?"

అందరూ కొట్టువాడి మీదికి ఎగబడి మరీ బేరంచేసి కిళ్లీలు కట్టించుకున్నారు.

"ఒరేయ్ ! నేను వచ్చేదాకా తినకండి. అందరం ఒక్కసారే నోట్లో పెట్టుకుందాం. అమ్మగారికి కిళ్లీలు ఇచ్చి వచ్చేస్తాను."—గోపాలం పరిగెత్తాడు.

ఆవిడ గోపాలంతో అరటిపళ్లు కూడా తెప్పించుకొంది. చంటిపిల్లాడు ఏడుస్తున్నాడని ఓ జంతిక తెమ్మని మళ్ళా పంపింది—వాళ్ళు కిళ్లీలు నమిలేస్తున్నారో ఏమిటో ఒకటే బాధ గోపాలానికి. అమ్మగారికి అన్నీ యిచ్చి బయటపడ్డాడు చివరికి.

"ఎంతకీ రావేమిట్రా ?"

"కిళ్లీలు తినేశారా ?"

"లేదు. ఇదిగో. నీది తీసికో."

"మరి ఇంక తినేద్దామా ?"

"నేను రైట్ అంటాను. అప్పుడు అందరం నోట్లో పెట్టేసుకుందాం—అంటున్నాను. రైట్"

కంగారుతో కిష్టిగాడు కిళ్లీ కింద పారేసుకున్నాడు. గబగబా నేలమీద తడుంకొని దుమ్ము దులిపి నోట్లో పెట్టేసుకున్నాడు.

"ఇంకో కానీ కానీ ఉందిగా ? ఏం కొనుక్కుందాం.

"సినిమాలోకి బఠాణీలు, జీళ్ళూ అవీ అమ్ముస్తాయట. అక్కడే కొనుక్కుందాం.

"మరి టిక్కట్లు కొనద్దూ ?"

"ఒరేయ్ ! నా నోరు పండిందేమో చూడరా ?" కిష్టిగాడు కప్పలా నోరు తెరిచాడు.

"పండటాలు తర్వాత చూసుకుందాం. ముందు టిక్కట్లమాట."

"నిజమేరోయ్. అమాటే మర్చిపోయాం."

"డబ్బులన్నీ మధు కిచ్చెయ్యండి. వాడు కొంటాడు.

"వాణ్ణలా తోసెయ్యకురా ! డబ్బులు పడిపోతాయి."

"నేను తోస్తున్నా ఏమిటి ? వాళ్లెవరో నన్ను తోసేశారు."

"సరేలే. దెబ్బలాడుకోకండి."

"ఇక్కడే నించొండి. అస్సలు కదలద్దు. నేను టిక్కట్లు కొని తెస్తాను. మళ్లీ మీరు కన్పించకపోతే ఎలా ?"

"ఒరేయ్ ! ఒక్కసారి నేను అలా వెళ్లి వస్తామురా."

"ఒద్దని చెప్పలా ? ఎక్కడికీ వెళ్ళొద్దు."

"నాకు కడుపు ఉబ్బిపోతోందిరా !"

"అయితే మరి తొందరగా వచ్చెయ్."

గోపాలం పరిగెత్తాడు. వాడు వచ్చాకే మధు టిక్కట్లు తేవడానికి కదిలాడు..

నలుగురూ గేటు దగ్గర మనిషికి ఎవరి టిక్కెట్లు వాళ్లే స్వయంగా భద్రంగా అప్పగించి డేరాలో జొరబడిపోయారు.

సినిమా హుషారుగా ఉత్సాహంగా సాగిపోయింది. బిలబిల్లాడుతూ లేచి ఇంటిమొహం పట్టేసరికి ఉత్సాహమంతా చచ్చిన ట్టయిపోయింది. సత్యన్నారాయణ తప్పుచేసిన వాడిలా పిల్లి గారిపోయాడు.

"నాకు భయం వేస్తోందిరా !"

"నిజమేరా ! మనం తీసికెళ్ళామని పెద్దమ్మ తిడుతుందేమో !"

"తిడితే తిడుతుందిలే. మాట్లాడకుండా ఎవరి పక్కల మీద వాళ్ళు పడుకోండి."

భయం భయంగానే వీధిలు ఎక్కారు. పార్వతి నిద్రపోకుండా ఎదురు చూస్తూ కూర్చుంది చావిట్లో. పిల్లలు నలుగుర్నీ చూసి ఏమీ మాట్లాడలేకపోయింది— సత్యన్నారాయణ కళ్ళ బడేసరికి సాంగపోయింది— "వెర్రి వెధవా ! నాకు చెప్పకుండ వెళ్ళిపోయావు కదూ ? ఏమైపోయావో అని హడిలి చచ్చాను. బాగా కూర్చున్నావా ? ఎవరైనా తొక్కేశారా ?"

సత్యన్నారాయణ నోరు పెగుల్చుకుని అన్నాడు.

"ఇంకెప్పుడూ వెళ్లను పిన్నీ !"

"ఏడిశావ్లే ! పడుకో. సుఖంగా వచ్చావు. అదే చాలు."— పార్వతి గదిలోకి వెళ్లిపోయింది. మధు పైకి ఎంత ధైర్యంగా ఉన్నా పెద్దత్త తప్పకుండా తిడుతుందనీ మామయ్యతో చెప్తుందనీ భయపడుతూనే నిర్లక్ష్యంగా తిరిగాడు.

పార్వతి మరేమీ అనక పోవటంతో కిక్కురు మనకుండా ఎవరి పక్కల్లో వాళ్లు దూరిపోయారు.

"ఒరేయ్ ! గోపాలం. అడుగో రాక్షసుడు !" కెవ్వుమంటూ కూర్చున్నాడు సత్యన్నారాయణ.

"ఒరేయ్ మధూ ! వాళ్ల పిన్ని నిజంగా తిడుతుందిరోయ్ !"

దొంగలా ఏడుకున్నాడు మధు.

మధు స్నేహబృందం— ముఠాలో సభ్యులంతా ఆ సినిమా చూసేశారు మొత్తానికి— ఓ సారి తోటలో. . . .

ఓ సారి తోటలో పిల్లలందా కలిసి సినిమా ఆడారు. మధు రాజకుమారుడు ! కృష్ణుడు రాక్షసుడు, రాజకుమారిలా సుధని ఉండమంటే ఉండనంది— హరిగాడు వాళ్ల చెల్లాయి పరికిణీ తెచ్చుకు తయారయ్యాడు.

రాక్షసుడి చేతుల్లోంచి రాజకుమారిని తప్పించటానికి రాజకుమారుడు మహావీరుడిలా ప్రయత్నాలు చేస్తున్నాడు— ఎంతకీ రాక్షసుడు లొంగటంలేదు. చివరికి ఎదురెదురుగా దెబ్బలాటకి దిగాడు రాజకుమారుడు— వేడిలో అంతా మరిచిపోం:

# సరాగమాల — వి. ఎ. కె. రంగారావు

నేనిమధ్య మద్రాసులో లేకపోవటం, తిరుగుతూన్న ఊళ్ళమంచి సమయానికి ఏదో వ్రాసి పంపటం జరిగింది. అందువలన రెండు ముఖ్యమైన విషాద వార్తలను సరాగమాలద్వారా అందజేయ లేకపోయాను. మొదటిది చాలామంది పత్రికలలో చదివే ఉంటారు. ప్రఖ్యాత సంగీత దర్శకులు శ్రీ గాలిపెంచల నరసింహారావుగారి మృతి గురించి.

గాలిపెంచల సంగీత దర్శకునిగా చిత్రసీమలో ప్రవేశించింది 1934వ సంవత్సరం. వారి మొదటి చిత్రం "సీతా కల్యాణం" ఆఖరిది "సీతా రామ కల్యాణం" అవడం ఒక విశేషం. ఈ మొదటి "సీతా కల్యాణం" లోనే రావణ సభలో విధ్వంసనంధా టించిన రామునికి వెక్కిరింపుగా "శివదీక్షా పరు రాలనురా" పదం అభినయం పట్టించడం జరిగింది. వారి ఆఖరిచిత్రం "సీతారామ కల్యాణం" ఒకటి రెండు పాటలు తప్ప తక్కినవన్నీ గాలిపెంచల చేసినవే. అతి ముఖ్యమైనదీ, కనీసం ఆరుమార్లు "రీటేక్" అయినదీ, ఇప్పటిదాకా బాగా అమ్ముడు పోతున్నదీ అందులో ఒకపాట "శ్రీ సీతారాముల కల్యాణం చూతము రారమ్మా".

ఈ రెండు చిత్రాల మధ్య దాదాపు ఇరవై పై చిలుకు చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించి ఉంటారు. వీరి సంగీతంలో ఎప్పుడూ శాస్త్రీయ రాగాల ప్రభావం ఎక్కువగా కనిపిస్తుండేది "మటి బజారు ధిక్కరమున నైతునా" అని గగ్గయ్య కంచు నిగా "కృష్ణ లీలలు"లో అరచినదీ. "సంతులక్ష్మి"లో "రాగ సుధారసమే", "మాయలోకం"లో "చెలియ మనకేలనే" అన్న జావళి బెజవాడ రాజరత్నం పాడి నదీ, "బాలరాజు"లో "సతి రూపము నీయరయా" అని క్షేత్రాలవం చేస్తూ ఎస్. వరలక్ష్మి పాడిన రాగమాలిక, "ధర్మాంగద"లో అలానే కృష్ణవేణి పాడిన రాగమాలిక, "అగ్నిపరీక్ష"లో పి. లీల పాడిన "విందు పున్నమి హాయి", శాస్త్రీయ రాగాధారాలైన సినిమా పాటలకు మచ్చు తునకలు.

ఇవన్నీ ఒక ఎత్తు. అనాటి "కృష్ణప్రేమ"లో పాటలు ఒక ఎత్తు. అందులో సుమారు ఇరవై పాటలు ఉంటాయనుకుంటాను. ప్రతి పాటా అత్యంత రమణీయమైనదే. ఆ పాటలను పాడిన దెవరు? శాంతకుమారి ("ఇదే ఆనంద మహోహో : ఊదుము కృష్ణా"), సూర్యకుమారి ("కృష్ణ జేజేలయ్యా గోపాలా : రారాదా ఆటలాడ పోరాదా") భానుమతి (చెంగల్వ పూవులోన) ఏ సంగీత దర్శకునికైన అంతకు మించిన వరమేమిటి ఉండగలదు. మొన్న వచ్చిన "కృష్ణప్రేమ"లో అనాటి పాటలు రెండు ఉంచారు. "రేపే వస్తాడంట గోపాలుడు", "ఎక్కడున్నావే పిల్ల".

ఇవికాక రెండు తమిళ చిత్రాలకు గాలిపెంచల పనిచేశారని తెలుస్తున్నది. సినిమాలలో ప్రవేశించక పూర్వం వీరు నాటకాలకు హార్మోనిస్టుగా ఉండేవారు. ఈ అనుభవాన్ని పురస్కరించుకొనే "గానకళ" అనే పుస్తకాన్ని వ్రాశారు. అందులో తాము స్వంతంగా రచించిన జావళులు, పదాలు, కీర్తనలు, ప్రార్థనలు స్వరపరచి ఇచ్చారు. ఇవేగాక కొన్ని హిందూస్థానీ తిల్లానాలు, "కాలేజి గరల్", "సారం గ—రుస్తుమ్" "శారద వివాహము" మొదలైన నాటకాలకు వారు కూర్చిన పాటలు, వాటికి మాతృక లైన ఇతర పాటల జాబితాలతోసహా, ఇచ్చి ఉన్నవి. "సంగీత కళానిధి" అనే మరొక బృహద్గ్రంథాన్ని ఇటీవలే పూర్తిచేశారట. ఇంకా అముద్రితంగానే ఉంది.

తేనాంపేటలో ఉన్న తమ స్వగృహంలో మేనెల ఇరవై ఐదవ తేదీన ఉదయం నాలుగు గంటలకు పరమపదించినారు. (వీరి గురించి నేను చెప్పిన విష యాలకు చాలమట్టుకు ఇంటూరి సంపాదకీయాల లోనివే. టి వి. ఎస్. శాస్త్రి చెప్పినవి)

* * *

చిన్న, బుల్లివార్త : "తేనె మనసు"లో ఒక నాయకి అయిన సంధ్యారాణి చక్కగా, భలే చక్కగా, అడిగినప్పుడు బెట్టుచేయకుండా పాడుతుంది.

* * *

భానుమతి శ్రీనివాస్ కలసి "వివాహబంధం"లో పాడిన యుగళగీతం, భానుమతి పాడిన తక్కిన గీతాలు అందులోవీ, "బొబ్బిలి యుద్ధం" లోవీ ఇప్పుడు మార్కెటులో మీరు విని కొనటానికి సిద్ధంగా ఉన్నాయి. ★



ప్రజా సేవా కార్యక్రమాలకోసం సినీనటుడు శ్రీ ఎన్. టి. రామారావు జూన్ 27 న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారికి లక్ష రూపాయలకు చెక్కు సమర్పిస్తున్న చిత్రం

"ఆడుకోనివ్వకపోతే పనెందుకు చెప్పారేమిటి ?" మధు దూరంగా నిలబడి ధైర్యంగా అన్నాడు.

విశ్వనాధం వాడికేసి తీక్షణంగా చూశాడు. "చెళ్ళకర్ర గంతులెయ్యకపోతే ఆటకాదా ? కోతి వెధవా? ఈ సారి చెళ్ళకర్రెందు. చూస్తాను."

చెట్లమీద ఎక్కి కోతికొమ్మచ్చు లాడుకోక పోతే తోటపని చేసిన అలసటే తీరదు. అయినా విశ్వనాధానికి జడిసి పిల్లలు మూతా కాస్త లొంగక తప్పలేదు.

ఆ ఏడు తోటలో చెట్లన్నీ బాగా కాసాయి. మామిడి కాయలు చాల వరకు చెట్ల మీద బేరం పెట్టేశాడు విశ్వనాధం, బేరగాళ్ళు తోటలోకి వచ్చి మామిడి కాయలు రకరకాలుగా బుట్టలు కట్టుకుని సంతకు తోలుకు పోయారు. అమ్మినవి అమ్మగా విశ్వనాధం స్వయంగా దగ్గర ఉండి పెయ్యి కాయ వరకూ అటకల మీద పేర్పిం చాడు. ఆ రోజు పిల్లలందరికీ కాస్త పండిన వాటిలో తలో రెండు కాయలూ దొరికాయి.

మర్నాడు - మరోనాడు - మూడోనాడు... వారం రోజులు గడిచినా మామిడి పళ్ళ సంగతి ఎవ్వరూ ఎత్తనే లేదు.

"అమ్మమ్మా ! మామిడి పళ్ళు ఇవ్వవే." అంటూ మధు సుందరమ్మ గార్ని ఎన్నిసార్లు అడి గినా - "ఇంకా పండ లేదట. నేనేం చూశానా ? చూశానా ?" అంది.

"పిల్లా ఎదురా ? ఇంకా కాయలు పండనే లేదూ ?"

"అసలు అంగినప్పటి కాయలు పండనే అక్కర్లే దురా !"

"మనం కష్టపడి చేశాం కదా ? మన కెందుకు పెట్టరేమిటి ?" — స్నేహితులంతా మధు

# కూలిన గోడలు

చుట్టూ చేరి ప్రశ్నల వర్షం కురిపించారు. "అయితే నేనివ్వాళ అడిగేస్తాను." అన్నాడు మధు దృఢంగా.

మధు ఇంటికి వచ్చే సరికి పార్వతి పిలిచి రెండు కాయలు ఇవ్వబోయింది. మధు సంతోషంగా అన్నాడు — "రాము - హరి - గోపీ — వాళ్ళం దర్నీ పిల్చుకురానా అత్తా ?"

పార్వతి ఆశ్చర్యంగా చూసింది — "వాళ్ళంద రికీ మొన్న ఇచ్చాంగా ? ఇవాకెక్కడివి ?"

మధు అయోమయంగా చూశాడు. "అదే మిటి ? అలా చూస్తావ్ — అందరికీ కాయలు దింపిననాడు రెండేసి ఇవ్వలేదూ ?"

"అనేనా ?" ఆశ్చర్యంగా — కోపంగా — పౌరు షంగా — అంతుపట్టని విధంగా అడిగాడు మధు.

"ఇది మరీ బాగుంది. కొబ్బరికాయలంతేసి కాయలు రెండేసి ఇస్తే ఇంకా చాలవా? చాలక పోతే మాత్రం నేనేం చెయ్యను ? అటక మీద పండేశారన్నమాటే గాని ఎవరు తిన్నారని ? మొన్న టికీ మొహర్నాటికీ ఎవరెవరికో ఇచ్చేసుకొన్నారు."

"అంతా ఉత్తిది. ఎవరికీ ఇవ్వలేదు. నాకు తెలీదా ? ఇదిగో అబ్బాయ్ ! నీతో నేను వాగ లేను. నీ కిష్టమైతే ఆ రెండు పళ్ళూ తీసుకువెళ్ళు లేకపోతే లేదు."

"నాకేం వద్దు., అన్నీ మీరు తినేసి, వెధవ రెండు పళ్ళు .........."

"మాట్లాడకుండా వెళ్ళమన్నానా ? మీ మామయ్యతో చెప్పే వరకూ నిలబడు. ఆ అడిగే దేదో అయినవ్వే అడుగుదువుగాని ........."

పార్వతి పీట మీద పెట్టిన పళ్ళకేసి ఒక్కసారి చూసి వెళ్ళిపోయాడు మధు.

మిట్ట మధ్యాహ్నం వేళ పార్వతి, సావిత్రి గదుల్లో పడుకున్న సమయంలో పిల్లిలా అటక ఎక్కి చూశాడు. మధు — ఎక్కడో వెనగ్గా ఓ గంపెడు కన్నా ఎక్కువ లేవు పళ్ళు. అవీ వళ్ళ వళ్ళగా డాగులు పడి కుళ్ళి పోతూ వున్నాయి. — మరుక్షణం రాయిలా వుండి పోయాడు. ఈ అటకనీ — పళ్ళనీ — ఇంటినీ అందర్నీ ఏదో చేసెయ్యాలనిపించింది. కసిగా పళ్ళు నూరుకున్నాడు.

ఆ వార్త మధు స్నేహితుల్ని కోతుల్ని చేసింది — "మనకు పెట్టకుండానే వాళ్ళు తినేశారు" ఆ విషయం వాళ్ళందర్నీ దహించి వేసింది.

"మనమేనా అంత చేతకాని వాళ్ళం ?" ఆ ప్రశ్న వాళ్ళని ఊపి పారేసింది.

"చూస్కో ! రేప్పొద్దుట్టికి....తోట.... సఫా !"

"భలే ఐడియా ! అంతే ! తోట మసి !"

"పువ్వూ - పిందీ — కాయా — చెట్టూ అన్నీ" ఆవేశంతో వూగి పోయారు పిల్లలంతా.

"ఉహూ !" అడ్డంగా తలవూపాడు మధు.

"ఏమిటి ?"

"ఒద్దు, తోట నేమీ చెయ్యొద్దు."

"అయితే మనం నోరు మూసుకుని వూరు కుందామా ?"

"కష్టపడి పని చేసిన వాళ్ళకి పెట్టకుండానే తినేశారే ! వాళ్ళకి బుద్ధి ఎలా వస్తుంది ?"

ప్రశ్న వరంపర ఎదురైనా మొక్కపోయింది.

మధు అందరికీ సమాధానంగా అన్నాడు— "తోట మనం కష్టపడి పెంచాం. ప్రతి మొక్కనీ ప్రతీ కొమ్మనీ ఎంతో అభిమానంతో చూసుకున్నాం. స్వయంగా మన చేతులతో ఎత్తు నాలు పాతి మొక్కల్ని పెంచాం. తోట ఎవరిదో కాదు. మనది ! ఇప్పుడు కోపం వచ్చి మన తోటని మనమే నాశనం చేద్దామా? మనం నాటిన మొక్కలన్నీ మనమే పీకిపారేద్దామా ?"— మధు అందరికేసీ చూశాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. అందరికీ మధు ఉద్దేశ్యం సమంజసంగానే తోచింది.

"నిజంగా ఇప్పుడు మనందరికీ చాలా కోపం ఉంది. మనకు పెట్టకుండానే వాళ్ళు అన్నీ తినే శారు. వాళ్ళ మీద కసి తీర్చుకోటానికి నాకో ఆలో చన వచ్చింది."

పిల్లలంతా సంభ్రమంగా చూశారు.

"చెప్తానుగా ? అంతేగాని మనం పెంచిన తోటని మనం ఎప్పుడూ చంపుకో కూడదు. అవునా ?"

"నిజమే. మరి మేము కోపంలో అలా అనేశాం." పిల్లలు సంజాయిషీ చెప్పుకున్నారు.

"మనకసి అంతా తీరిపోయే ఉపాయం నేను చెప్తాగా ?"

"రైటో ! రైటో !"

మధు చెప్పబోయే ఉపాయం బ్రహ్మాండంగా ఉంటుందన్న విశ్వాసం వాళ్ళని సంతోషంతో వెర్రివాళ్ళని చేసింది.

* * *

ఆ సాయంత్రం విశ్వనాధం తోటంతా తిరిగి వచ్చి సీతాపతితో అన్నాడు— "కొబ్బరి బొండా లన్నీ పండి పోతున్నట్టున్నాయి. ఇంకా ఎందుకు ఉంచటం ? రేపొద్దుట అవి కోయించు ముందు"

"అలాగే." అన్నాడు సీతాపతి.



ఎప్పటిలా పిల్లల్ని తీసుకుపోద్దామే తోటలోకి కొబ్బరి చెట్ల దగ్గరికి వెళ్లిన సీతాపతి—మూర్యం కొయ్యబారి పోయారు— ఒకరి మొహా లొకరు చూసుకున్నారు—

"అయ్యో ! బొండాలేవి మామయ్యా ?" మధు ఆశ్చర్య పోయాడు.

"అదేమిటి ? ఇప్పుడే కదూ మనం కొయ్యాలని వచ్చాం ?" తను కూడా ఆశ్చర్యం వెలిబుచ్చాడు గోపాలం.

"ఎవరో దొంగ వెధవలు ! ఎప్పుడూ లేదే !" సీతాపతి గబగబా ఇంట్లోకి వెళ్లాడు.

బయటకు వెళ్లటానికి సిద్ధమవుతున్న విశ్వనాథం సీతాపతి చెప్పింది విని నిర్ఘాంత పోయాడు.

"బొండాలన్నీ తెంపుక పోయారా ? ఏవిట్రా నువ్వనేది ? ఎవర్రా తెంపుక పోయింది ?"

"అదేమో ! మేము వెళ్లేసరికి చెట్లు బోసిగా ఉన్నాయి. నీతో చెప్పాలని నేను వచ్చాను."

"పద నేనూ చూస్తాను" విశ్వనాథం తోటలోకి వెళ్లాడు. బోసి కొబ్బరిచెట్లు విశ్వనాథాన్ని వెక్కిరించాయి.

"దొంగ వెధవలు ! ఎవరో మరి. రాత్రి గేట్లన్నీ సరిగ్గా కట్టలేదూ ?"

"ఎలా ఉండేవి అలాగే ఉన్నాయి."

"సరే ! చూద్దాం. ఈ రాత్రి నుంచి తాళాలు కొనుక్కు వచ్చి మరీ వేయించు. ఎలా వెళ్తారో చూద్దాం."

రెండు వారాలు గడిచి పోయాయి.

"చూశావా ? తాళాలు వెయ్యటంతో చచ్చి పూరుకున్నారు. లేకపోతే సపోటా పళ్లన్నీ అలా

39 వ పేజీ చూడండి

## 10-7-1964 శుక్రవారము మొదలు 16-7-1964 గురువారము వరకు

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారంకూడా గతవారం వలెనే ఉంటుంది. వ్యాపారంలో అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. నూతన వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. భాగస్వాములతో ఏర్పడిన అభిప్రాయభేదాలు తొలగిపోయే సూచనలు ఉన్నాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు రాణించకపోవచ్చును. వృత్తి ఉద్యోగాలు సామాన్యంగా ఉంటాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా సాగిపోతాయి. విద్యారంగంలో మీ బుద్ధి చురుకుగా పనిచేస్తుంది. సంతానానికి సౌఖ్యం, సంతోషం లభిస్తాయి.

(స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాల్లో కొన్ని మార్పులు వస్తాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

* * *

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

ఈవారం సామాన్యంగా ఉంటుంది. వ్యాపారం ఒడుదుడుకులు లేకుండా సాగిపోతుంది. మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాలకు ఫలితం ఈవారంలో మీరు పొందగల సూచనలు ఉన్నాయి. వృత్తిరీత్యా ప్రయాణం చేస్తారు. ఉద్యోగం సామాన్యంగా ఉంటుంది. సమాజంలో పలుకుబడి పెరుగుతుంది. సమయానికి డబ్బు అందక కొంత ఇబ్బంది కలుగుతుంది. కాని మీరు మాత్రం సకాలంలో స్నేహితులకు తోడ్పడగలరు. ఆరోగ్యం అంత బాగా ఉండదు. సాహిత్యరంగంలో మీ కృషికి ఆటంకం కలగవచ్చును. ముఖ్యమైన కార్యక్రమాలు వాయిదా వేయడం మంచిది.

(స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. శుభకార్యాలమూలంగా ధన వ్యయం జరుగుతుంది. ప్రయాణం చేయగల సూచనలు ఉన్నాయి.

* * *

### మిథునం :

(మృగశిర 3, 4 పా ఆర్ద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

అప్పుడప్పుడు కొన్ని చికాకులు ఎదురైనా మీరు దృఢనిశ్చయంతో వ్యవహరించడంవలన అన్ని వ్యవహారాలు సక్రమంగా జరుగుతాయి. మీరు ఇదివరకు ప్రారంభించిన వ్యవహారాలకు ఇప్పుడు ప్రాముఖ్యత రావడం వలన నూతన వ్యవహారాలను గురించి ఆలోచించడానికి అవకాశం ఉండదు. ఆర్థికంగా బాగా ఉన్నా వృత్తి ఉద్యోగాల్లో శ్రమా, శ్రిప్పటా కలుగుతాయి. మిమ్మల్ని ఎంతవరకు ఒత్తిడి చేస్తున్న ఆస్తికి వ్యవహారాలనుంచి చాలవరకు విముక్తి లభిస్తుంది. ఆరోగ్యం అంత బాగా ఉండదు. సత్పురుషుల సహవాసం లభిస్తుంది.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | గు | కు శు | ర రా |
| శ | వారఫలం మహేష్ | | చం బు |
| | | | |
| కే | | | |

(స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు

* * *

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈ వారం మొత్తం మీద బాగా ఉన్నా అప్పుడప్పుడు అకారణంగా కొన్ని చిక్కులు వస్తూ ఉంటాయి. వ్యాపారంలో మీరు తలపెట్టిన కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు అంత ప్రోత్సాహకరంగా ఉండవు. వృత్తి ఉద్యోగాల్లో యథాతథ స్థితిని కాపాడుకొంటారు. సాటివారిలో మంచితనం లభిస్తుంది. రావలసిన డబ్బును వసూలు చేయకుండా ఏ వ్యవహారం ప్రారంభించడం మంచిది కాదు. ఆరోగ్యం బాగా ఉంటుంది. ఇంత వరకు విభిన్నాభిప్రాయాలు గల బంధువులను ఒకదారికి తీసికొని రాగలరు. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

(స్త్రీలకు—ఆరోగ్యం గతవారంలో కంటే బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో మార్పులు రావు. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

* * *

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం సంతృప్తికరంగా ఉంటుంది. వ్యాపారములో ఏర్పడిన అనుకూల పరిస్థితి కొనసాగుతుంది. నూతన వ్యాపారాలు ఆకర్షణీయంగా కనుపించినా పూర్తిగా నమ్మడానికి అవకాశంలేదు. వృత్తి ఉద్యోగాల్లో మీరు చేస్తున్న కృషి వెంటనే ఫలితాన్నివ్వక పోయినా, వ్యర్థం మాత్రం కాదు. మీ అభిప్రాయాలు అధికారుల ఆమోదాన్ని పొందుతాయి. ఆరోగ్యం సంతృప్తి కరంగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో వ్యయప్రయాసకు గురి అయి కృషి చేసినా నిష్ఫలం రావచ్చును. కుటుంబ వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా సాగి పోతాయి.

(స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. అలంకార వస్తువులు కొంటారు.

**ఈ వారము ధరలు**

ధాన్యంధర కొంచెం పెరిగే సూచనలు ఉన్నాయి. అపరాల ధరలు తగ్గడానికి అవకాశం ఉన్నది. బెల్లంధర నిలకడగా ఉంటుంది. నూనె నువ్వుల ధరలు కొంచెం పెరిగి, తగ్గుతాయి. అలంకార వస్తువుల ధరల్లో మార్పులు రావు.

### కన్య :

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారం గత వారంకంటే బాగా ఉంటుంది. కాని సాహసముతో కూడిన వ్యవహారాలకు పూనుకోవడం మంచిది కాదు. సమయానికి ఏదో ఒక విధంగా డబ్బు అందుతుండడం వలన అన్ని వ్యవహారాలూ ఒడుదుడుకులు లేకుండా సాగిపోతాయి. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు అంత ప్రోత్సాహకరంగా ఉండవు. వృత్తి ఉద్యోగాల్లో సాటి వారితో భేదాభిప్రాయాలు రావచ్చును గాని, మీకు ఏ విధంగాను నష్టం కలగదు. ఆరోగ్యం సాధారణంగా ఉంటుంది. రాజకీయాల్లో ప్రతి పక్షాల బలం పెరిగే సూచనలు ఉన్నాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

(స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. అనవసర వ్యయం జరుగుతుంది. బంధువుల వ్యవహారాల్లో నిష్ఫలం రావచ్చును.

* * *

### తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాల )

ఈ వారం మీ ఓర్పుకు, నేర్పుకు పరీక్షా సమయం. మీరు ఎంతో శ్రమపడి ఒక దారికి తెచ్చిన వ్యవహారంలో కూడా మరల చికాకులు వచ్చే సూచనలు ఉన్నాయి. కాని మీ చాకచక్యం వల్ల వాటిని అధిగమించడానికి అవకాశం ఉంది. వ్యాపారంలో వెంటనే ప్రయోజనం లేక పోయినా, ముమ్ముందు ఉపయోగించగల మార్పులు వస్తాయి. వృత్తి ఉద్యోగాల్లో గౌరవం లభిస్తుంది. ఇంత వరకు మీ పట్ల ఉదాసీనంగా ఉండే వ్యక్తులు కూడా మీ అభిప్రాయాలను గౌరవిస్తారు. జీర్ణసంబంధమైన అనారోగ్యం చేయవచ్చును. ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

(స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. కుటుంబ వ్యవహారాలు కొన్ని మార్పులతో నెరవేరతాయి. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది.

* * *

### వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారం అంత బాగా ఉంటుందని చెప్పడానికి అవకాశం లేదు. వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో స్వల్పంగా అనుకూలత ఉంటుంది. మీరు ఇది వరకు జరిపిన వ్యవహారాలవల్ల ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును. అధికారుల వలన పనులకు

# వారఫలాలు

ఆటంకాలు వస్తాయి. ఉద్యోగంలో కొంత శ్రమ పెరుగుతుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో కొత్త చిక్కులు రావచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాంఘిక కార్యక్రమాలు నిరాటంకంగా సాగి, పలుకుబడి పెరగగల సూచనలు ఉన్నాయి. శుభ కార్యాల మూలంగా ధన వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యహారాల్లో కార్యభారం పెరగడం వలన తీరిక లభించదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

* * *

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ప్రతి క్షణమూ ఏదో సందేహాలు కలుగుతూ ఉండడంవలన సాహసించి ఏ పనీ చేయలేరు. కాని మీ సందేహాలు సరియైనవేనని రుజువు కావడం వలన మీరు ఏ పనీ చేయకుండా ఉండడమే సంతృప్తిని కలిగిస్తుంది. వ్యాపారంలో నష్టం రాదు.కాని ఏ వ్యవహారమూ సులువుగా నెరవేరదు. వృత్తి ఉద్యోగాల్లో పెద్ద మార్పులు రావు. వారారంభంలో స్వల్ప అనారోగ్యం చెయ్యవచ్చును. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది. సాహిత్య కళా రంగాల్లో మీరు చేసిన కృషి పరిగణింపబడుటకు తగిన అవకాశం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సక్రమంగా నెరవేరతాయి. ముఖ్యమైన సాంఘిక కార్యక్రమాల్లో పాల్గొంటారు.

* * *

## మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా.)

వారం మధ్యలో కొంత ఆందోళన కలిగినా మొత్తం మీద ఈ వారం ప్రోత్సాహకరంగా ఉంటుంది. వృత్తివ్యాపారాల్లో గత కొద్ది వారాల్లోను అసాధ్యాలుగా కన్పించిన వ్యవహారాలు కూడా సాధ్య పడతాయి. నూతన వ్యవహారాలు, భారీ ఎత్తున చేసే వ్యాపారాలు రాణించుటకు అవకాశం ఉంది. ఉద్యోగంలో ఇంత వరకు ఏర్పడిన అవరోధాలు అభిప్రాయ భేధాలు తొలగి పోతాయి. కోర్టు వ్యవహారాల్లోకూడా అనుకూలత లభించవచ్చును. ఆరోగ్యం సంతృప్తి కరంగా ఉంటుంది. ప్రేమ వ్యవహారాల్లో వారారంభంలో ప్రోత్సాహం లభిస్తుంది.

స్త్రీలకు—వారాంతంలో అనారోగ్య సూచనలున్నాయి. బంధువులతో ఏర్పడిన అభిప్రాయ భేదాలు తొలగి పోతాయి. విలువైన వస్తువులు కొంటారు.

* * *

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1,2,3 పా.)

వారం ప్రారంభంలో బాగా ఉన్నా వారాంతంలో కొన్ని చికాకులు రావచ్చును. మీకు రావలసిన డబ్బు

సమయానికి అందకపోవడం వలన కొన్ని వ్యవహారాల్లో ఇబ్బందులు రాగల సూచనలు ఉన్నాయి. వ్యాపారంలో అనుకూల పరిణామాలు రావచ్చును. వృత్తి ఉద్యోగాలు సామాన్యంగా ఉంటాయి. మీకు ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యక్తులే కొంత మంది నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. అన్ని వ్యవహారాల్లోనూ జాగ్రత్త చాలా అవసరం. ఆరోగ్యం బాగానే ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకోవడం ద్వారా విజ్ఞానాన్ని పెంపొందించుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉన్నా బలహీనత కన్పించ వచ్చును. శుభకార్యాలను గురించిన అనుకూల వార్తలను వింటారు.

* * *

మీనం.

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

వృత్తి వ్యాపారాల్లో కొన్ని చికాకులు వచ్చేటట్లు కన్పిస్తాయి గాని మీ సమయస్ఫూర్తి వల్ల వాటినుండి తప్పించుకొంటారు. ఆర్థికంగా ఒత్తిడి ఉన్నా వ్యాపారంలో స్వల్పాభివృద్ధిని సాధిస్తారు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు సామాన్యంగా ఉంటాయి. ఉద్యోగంలో అభివృద్ధి లేక పోయినా అనుకూలత ఉంటుంది. వృత్తికి సంబంధించిన వ్యవహారాల్లో మీకు అనుకూలమైన సంఘటనలు కలుగవచ్చును. డబ్బు ఇచ్చి పుచ్చుకోవడాల్లో తగాదాలు రావచ్చును. ఆరోగ్యం సంతృప్తి కరంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు. కుటుంబ కార్యక్రమాల్లో చిన్న మార్పులు రావచ్చును. ★

# జన్మదినఫలం

## జూలై -10

అన్ని వ్యవహారాల్లోను ఆర్భాటం పాడావిడి తప్ప ఆర్థికంగా ప్రయోజనం ఉండదు. ఎంతో ప్రయత్నం చేసిన తర్వాత గాని ఏ పని సాధ్యపడదు. మొత్తంమీద వ్యాపారంలో ప్రయోజనంకంటే ప్రయాస అధికంగా ఉంటుంది. కొంతమంది వ్యక్తులు వ్యాపారంలో మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నం చేస్తారు. వృత్తి ఉద్యోగాలు బాగానే ఉంటాయి. కొన్ని అనుమానాలు కలగడంవలన ముఖ్యమైన పనులు వాయిదా వేస్తారు. ఆరోగ్యం బాగానే ఉంటుందికాని ప్రయాణాల్లో జాగ్రత్త అవసరం. కుటుంబ వ్యవహారాలు ఇదివరకటికంటే బాగా ఉంటాయి. ఇంతవరకు ఉన్న అభిప్రాయభేదాలు తొలగిపోతాయి. కుటుంబంలో శాంతి, సౌఖ్యం లభిస్తాయి. విద్యార్థులు కొంచెం శ్రమమీద కృతార్థులు కాగలరు. ఆహార పదార్థాల వ్యాపారస్థులకు, రాజకీయవేత్తలకు యోగవంతమైన సమయం.

## జూలై -11

ఈ సంవత్సరం చాలా బాగుంటుంది. మీరు గత సంవత్సరాంతంలో తలపెట్టిన వ్యవహారాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ఆకస్మికంగా కొన్ని మార్పులు రావడంవలన ఆదాయం అంతనూ కూడా పెరిగే సూచనలు ఉన్నాయి. అధికులతో పరిచయం లభిస్తుంది. తద్వారా ప్రయోజనం ఉంటుంది. సాహసముతో కూడిన వ్యాపారాలు కూడా స్వల్పంగా లాభిస్తాయి. వృత్తి ఉద్యోగాలు ఇదివరకటికంటే బాగా ఉంటాయి. ఉద్యోగస్థులు అనుకూలమైన స్థానమునకు మార్చబడవచ్చును. గృహ నిర్మాణాది ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబంలో పెద్దవారికి అనారోగ్యం చేయడం వలన ఆందోళన కలగవచ్చును. రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలను ప్రారంభించి విజయం పొందుతారు. విద్యార్థులకు క్లాసు వచ్చుటకు అవకాశం ఉన్నది.

## జూలై -12

ఈ సంవత్సరం అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. మీ ఆశలు, ఆశయాలు కార్యరూపాన్ని ధరించే సమయం. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. భారీ ఎత్తునచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తి ఉద్యోగాల్లో కొంచెం శ్రమ పెరిగినా తగిన ప్రతిఫలం ఉంటుంది. ఉద్యోగంలో ఉన్నతస్థానంకోసం ప్రయత్నించడానికి తగిన సమయం. సంవత్సరం మధ్యలో మీరు అంతకుముందు చేసిన వాగ్దానాలవల్ల ఆర్థికంగా ఇబ్బంది రావచ్చును. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అప్పుడప్పుడు కొద్ది చికాకులు వచ్చినా మొత్తంమీద సంతృప్తికరంగానే ఉంటుంది. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## జూలై -13

ఈ సంవత్సరం అన్ని వ్యవహారాల్లోను జాగ్రత్తగా ఉండడం అవసరం. మీకు ఇంతవరకు సహాయం చేస్తున్నవారికి కొన్ని చికాకులు రావడంవలన మీ వ్యవహారాల్లో కూడా ఇబ్బందులు రావచ్చును. వ్యాపారంలో ఆదాయం పెరిగినా తలపెట్టిన వ్యవహారాలు సక్రమంగా జరగనందున సంతృప్తి లభించదు. వృత్తి ఉద్యోగాలు సామాన్యంగా ఉంటాయి. పై అధికారులతో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగస్థులు అనుకూలమైన స్థానమునకు మార్చబడవచ్చును. ఆరోగ్యం అంత బాగా ఉండదు. ఉష్ణ సంబంధమైన అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. రాజకీయాల్లో లాభదాయకమైన మార్పులు రావచ్చును. పుణ్యకార్యాలు యాత్రలు చేస్తారు. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

## జూలై -14

కేవలం మీ ప్రయత్నంవలనే కాకుండా మిత్రుల సహాయంవలనగాని సోదరుల తోడ్పాటువలనగాని మీ వ్యవహారాలు నెరవేర్చుకొనగల్గుతారు. వ్యాపారంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. నూతన వ్యాపారాలవల్ల ప్రయాస తప్ప ప్రయోజనం ఉండదు. మీరు ఎంత జాగ్రత్తగా ఉన్నా కొన్ని వ్యవహారాల్లో అనవసర వ్యయం జరుగుతుంది. వృత్తి ఉద్యోగాలు సంతృప్తికరంగా ఉంటాయి. వృత్తిరీత్యా దూరప్రయాణాలు చేసి ఉన్నతోద్యోగులను కల్సుకొంటారు. కోర్టు వ్యవహారాల్లో కొంత శ్రమమీద అనుకూలత లభించవచ్చును. ఆరోగ్యం బాగా ఉంటుంది కాని సంవత్సరం మధ్యలో నేత్ర సంబంధమైన అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. విద్యార్థులకు క్లాసు వచ్చుటకు అవకాశం ఉన్నది. వస్త్ర వ్యాపారస్తులకు, పారిశ్రామికవేత్తలకు మంచి సమయం.

## జూలై -15

ఈ సంవత్సరం మొత్తంమీద బాగా ఉన్నా అప్పుడప్పుడు ఒడుదుడుకులు వస్తూ ఉంటాయి. వ్యాపారం సామాన్యంగా ఉంటుంది. కొంతమంది మిత్రులకు సంబంధించిన వ్యవహారాలను పరిష్కరించవలసి వస్తుంది. మీ స్వంత పనులకంటే ఇతరుల వ్యవహారాల విషయంలో ఎక్కువ శ్రమ పొందుతారు. ఆదాయం మామూలుగా ఉన్నా సంఘంలో పలుకుబడి గౌరవం పెరుగుతాయి. వృత్తి ఉద్యోగాలు ఇదివరకటికంటే బాగా ఉంటాయి. వృత్తిలో ఆదాయం స్వల్పంగా పెరగవచ్చును. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఆకస్మికంగా కొన్ని చిక్కులు రావచ్చును. మీ తాలూకు విలువైన వస్తువులను మీ మనుష్యులే అపహరించే ప్రమాదం ఉంది. ప్రేమ వ్యవహారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

## జూలై -16

ఏ వ్యవహారం ఎలాగ ఉన్నా ఈ సంవత్సరం ఆర్థికంగా బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు ఎదురుచూడని అవకాశాలు లభిస్తాయి. వ్యాపారస్థులకు సంవత్సరాంతంలో ఆకస్మిక ధనలాభం కలుగవచ్చును. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు ప్రారంభించడానికి మంచి సమయం. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగల సూచనలు ఉన్నాయి. వృత్తి ఉద్యోగాల్లో హోదా, ఆదాయం రెండూ పెరగవచ్చును. సంవత్సరం మధ్యలో ఏర్పడిన అనుకూలత సంవత్సరాంతానికి ఉండకపోవచ్చును. స్థిరాస్థి వ్యవహారాల్లో విజయం లభిస్తుంది. ఆరోగ్యం అంత బాగా ఉండదు. కుటుంబ వ్యవహారాలు మామూలుగా జరిగిపోతాయి. శుభములమూలంగా ధన వ్యయం జరుగుతుంది. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు అనుకూలంగా ఉంటాయి. నవంబరు, డిశంబరు నెలల్లో సంతోషం, బంధుమిత్ర సమాగమం. ★

కొత్త సీరియల్ ప్రారంభం :

# కార్యసిద్ధి

ముద్దా శాస్త్రిబాబు

"ఎవరూ?- గండక నగరాధిపతియా ? - చక్రపాణి మహారాజా ? - సతీ సమేతంగా ఏమిటిదీ?" అని ఆశ్చర్యంతో అడిగాడు, శౌనకమహాముని.

"మహానుభావా! నమస్కారం! తమ దర్శనం లభించింది. ధన్యులమయ్యాం. ఇవాళ సుదినం!" అంటూ సతీసమేతంగా సవినయంగా సాష్టాంగ నమస్కారం చేశాడు చక్రపాణి.

"మహారాజా!— నువ్వూ, నీ ప్రజా క్షేమమేనా? నీ రాజ్యంలో ఈతిబాధా, శత్రుబాధా లేవు కదా?—"

"మీ చలవవల్ల నేనూ, నా ప్రజాక్షేమమే స్వామీ!—"

"మరి నువు సతీసమేతంగా అడవుల పాల్పడానికి కారణం?—"

"త్రికాలజ్ఞులు— తమకు తెలియనిదేముంది మహాత్మా!— మాకు ఏలోటూ లేదు, మీ దయవల్ల. కాని.....వంశాన్ని ఉద్ధరించటానికి......ఒక్క విసుగు.......ఒక్క విసుగు" అంటూ కంట తడి పెట్టాడు, రాజు. రాణికీ కళ్లవెంట జలజలమని అశ్రువులు రాలాయి.

"ఓహో—సంతానం లేదనా మీ సంతాపం?—" అని దీర్ఘంగా నిట్టూర్చి ఆలోచనలో పడ్డాడు, శౌనక మహర్షి.

"స్వామీ!— సమస్తమయిన నోములూ నోచాం. వ్రతాలూ, క్రతువులూ సలక్షణంగా జరిపాం. చేతికి ఎముకలేకుండా దానాలూ, ధర్మాలూ చేశాం. ఫలితంగా మా కడుపు పండింది. కానీ......ఒక్క కాయయినా మాకు దక్కితే కద!— అసలు సంతతే లేకపోతే ఒక్కటే విచారం. ఇలా పుట్టటం, చావటం మాకు ఆరని చిచ్చుగా ఉంది. ఈ ఘోరం ఎంత కాలం సహించగలం?— మహాత్మా!— ఇంతకీ మేం చేసుకున్న మహా పాతకం ఏమిటి?— ఆ మహాపరాధానికి ప్రాయశ్చిత్తం ఏమిటి?— సెలవియ్యండి. శిరసావహిస్తాం......" అంటూ రాజదంపతులు మహర్షిని వేవిధాల వేడుకున్నారు.

"తొందరపడకు రాజా! — నిదానించు. పాపం చేసినవాళ్లకేగాని నీ కెందుకు ప్రాయశ్చిత్తం?— నువ్వే పాపమూ ఎరగవే!—చూడగా—నీకు గొప్ప సంతాన యోగముంది. స్పష్టంగా కనిపిస్తూ ఉంది. అటువంటప్పుడు నీకు కలవరం దేనికి?— ఆ సంతానం కూడా సామాన్యమయింది కాదు సుమా!— సూర్య భగవానుడి. అనుగ్రహంవల్ల వరప్రసాది అయిన సుపుత్రుడు నీకు కలగబోతున్నాడు. వాడే మీ వంశోద్ధారకుడు. కులదీపకుడు. వాడు వీరుడూ, ధీరుడూ, శూరుడూ అవుతాడు. నిన్ను మించినవాడై గొప్ప పేరు ప్రతిష్టలు సంపాదిస్తాడు. వెంటనే నీవు రాజధాని చేరుకో. సూర్యవ్రతంచెయి. నీవు తపస్సు చేయవలసింది ఇప్పుడు కాదు. నీ కొడుకును గద్దె ఎక్కించి— ఆ తరువాత," అని ధైర్యం చెప్పి దీవించి రాజదంపతులను సాగనంపాడు శౌనకుడు.

మహర్షివద్ద సెలవు తీసుకుని అంతులేని ఉత్సాహంతో రాజధానీ నగరం చేరుకున్నారు.

కొద్ది రోజులు గడిచాయి. మహారాణి ఉగ్రాదేవి ఏదో విపరీతమయిన తాపంవల్ల బాధపడ సాగింది. చీటికీ మాటికీ ఉస్సురని నిట్టూరుస్తోంది. అవసోపాలు పడుతూంది. చల్లదనమిచ్చే పానీయాలు ఎన్నో తయారుచేసి ఇచ్చారు చెలికత్తెలు. పన్నీరు చల్లారు, చందనం పూశారు, లోకంలోగల పువ్వులు రకరకాలు తెచ్చి వంటినిండా కప్పారు. ఇంతచేసినా, తాపం తగ్గలేదు రాణికి. అంతఃపురంలో నిలవ లేకపోయింది. ఉద్యానవనం ఉనికి ఏర్పాటయింది.

సింధునదీ తీరం. తీరాన ఉన్న ఉద్యానం. ఉద్యానవనంలో చల్లటి పిల్లగాలులు వీస్తుంటే ఉగ్రాదేవి తాపం కాస్తంత ఉపశమించినట్లు అనిపించింది.

ఈ విధంగా ఉద్యానంలోనే తొమ్మిది నెలలు గడిచాయి.

ఉన్నట్టుండి ఒకరోజున దేవికి నొప్పులు!—

సింధునది సముద్రపు హోరునుమించి గంభీరంగా ఘోషిస్తూ ఉంది. అటువంటి సమయంలో ఒక అపురూపమైన మగ శిశువును కన్నది. ఉగ్రాదేవి. ఆ శిశువు ధగధగమని మెరుస్తూ ఉన్నాడు; ఒక చేతో చక్రమూ, మరొక చేతో శూలమూ ధరించి కోటి సూర్య ప్రభలతో వెలిగి పోతున్నాడు!— ఆ తేజస్సు చూడలేక, కెవ్వున కేకపెట్టి కళ్లు మూసేసుకున్నారు చెలికత్తెలు!— దేవి మూర్ఛపోయింది.

*　　*

గండక నగరంలో ఆ రోజున—

ఏ గుమ్మం చూసినా పచ్చటి తోరణాలే!— ఏ వీధి చూసినా కలకల్లాడుతూ రంగు రంగుల పతాకాలే!— ఎక్కడ చూసినా వినోదాలే!— వేడుకలే!!— సంబరాలే!!!—

చక్రపాణి మహారాజా దర్బారుచేసి, స్వహస్తాలతో దానధర్మాలు కురిపిస్తున్నాడు!— ఆ ఆనందంలో అందరూ మైమరచి ఉన్నారు. పుణ్య దంపతుల పుత్రోత్సవంతో నాటి గండక నగర వైభవం దేవేంద్రలోకాన్ని ధిక్కరిస్తూ ఉంది!—

సింధునదీ తీరాన పుట్టిన ఆ బిడ్డడికి 'సింధు' అని నామకరణం జరిగింది.

*　　*　　*

అసురుల గురువయిన శుక్రాచార్యుడి ఆశ్రమంలో గొప్ప అలజడి బయల్దేరింది!—

ఏమిటది?—

రాజ్యంలోని రాక్షస యువకులంతా జట్టుగా చేరారు. పట్టరాని ఆవేశంతో కుల గురువుని చుట్టుముట్టారు :

"గురూ!— పుట్టి బుద్ధెరిగి నప్పటినుంచీ చూస్తున్నాం. ఈ దేవతల జగడాలు. క్షీర సాగర మథనంలో కష్టం మనదీ, అమృతం జుర్రుకున్నవాళ్లు వాళ్లూ. మహాచక్రవర్తి మన బలిని మట్టుపెట్టింది ఆ దుష్టులే!— రావణబ్రహ్మను మారణహోమం చేసింది ఆ దురాత్ములే!— మన విభీషణున్ని మందుపెట్టి మాయచేసి వాళ్ల వేపు తిప్పుకున్నారు ఆ క్రూరులు!— హిరణ్యాక్ష హిరణ్యకశిపులవంటి హేమాహేమీలను పొట్టను పెట్టుకున్న వాళ్లూ ఆ పాపాత్ములే! — వాళ్ల దుండగాలను ఇంకా సహించమంటారా?— ఇలా ఎంతకాలం?— చేతకాని చవటల్లాగా మమ్మల్ని చూస్తూ ఊరుకోమంటారా?— మీరిలా ఉపేక్షించటం ఏమీ బాగాలేదు గురువర్యా!— దేవతల దుర్మార్గాలను మీరు అరికడతారా?— మమ్మల్ని నడుం కట్టమన్నారా?—" అంటూ నిష్కర్షగా అడిగారు.

తనకున్న ఒక్క కన్నూ మూసి, ఆచార్యుడు ఫకాల్న నవ్వాడు :

"మీ అంత అమాయకుల్ని నేనెక్కడా చూడలేదు. మన గండకనగరంలో ఇవాళ జరగబోయే బ్రహ్మాండమైన ఉత్సవాల సంగతి మీకు తెలిసి మాట్లాడుతున్నారా?— తెలియక ప్రసంగిస్తున్నారా?—" అని ప్రశ్నించాడు.

ఒక్కళ్ళూ బదులు చెప్పలే.

"అయితే వినండి : సూర్యభగవానుడి వరప్రసాదంవల్ల మన మహారాజుకి పుత్రుడు కలిగాడు. ఆ పసివాడు సామాన్యుడు కాడు మన దాయాదులయిన దేవ గగ ● ) చిత్తుచేయటానికి జన్మించినవాడు. వానిపేరు 'సింధు', అతనికి జీవితంలో అపజయమన్నది లేదు. ఇటువంటి జగదేకవీరుడు మన కులానికి మకుటంగా పుట్టి ఉన్నాడు. ఎందుకు మీకీ కలవరం?—మీ వంటి యువకులు విచారించవలసిన సమయం కాదు యిది. మనకి కులభూషణుడు వెలిసినందుకు

విజయోత్సవాలు చెయ్యండి. వెళ్లండి!—" అని చెప్పి వాళ్ళని ప్రోత్సహించాడు, ఆచార్యుడు.

వెంటనే—

సింధు కుమారుడికీ —జై!—

సింధు కుమారుడికీ —జై!!—

అంటూ, యువజనులందరూ అక్కడ్నుంచి ఉత్సాహంగా కదలిపోయారు.

## 2

రాజకుమారుడు సింధు ఇంతవాడై అంతవాడై పెరిగి పెద్దవాడయ్యాడు. సకల శాస్త్ర పారంగతుడనిపించుకున్నాడు. సాము గరడీలు నేర్చి రణవిద్యలో నిపుణుడయ్యాడు.

యుక్త వయసు వచ్చింది.

లేక లేక ఒక్కగానొక్క పుత్రుడికి పట్టాభిషేకం చెయ్యాలని మహారాజు ఆత్రంగా ఉన్న సమయాన కులగురువు శుక్రాచార్యుడు వచ్చాడు.

"మహారాజా!— పట్టాభిషేకానికి ఏం తొందర? అంతకంటే ముందుగా మన యువరాజు ముఖ్యంగా చేయాల్సిన కార్యం ఒకటి ఉంది. ఆ మహా కార్యం పూర్తి అయిన తరవాత పట్టాభిషేకం మహోత్సవం జరపవచ్చు" అని సలహా చెప్పాడు.

ఈ మాట వినగానే సింధు కుతూహలంతో ముందుకు వచ్చాడు : "గురువర్యా!— ఏమిటా మహాకార్యం? — సెలవియ్యండి. ఇప్పుడే శిరసా వహిస్తాను." అని వినయంగా అడిగాడు.

అందుకు కులగురువు, "నాయనా!—సింధూ! జగత్తును పాలించే త్రిమూర్తులలోనూ మనవంటి భక్తులకు సులభసాధ్యుడు పరమేశ్వరుడు. కనక, అతన్ని సంతోషపెట్టి, కొన్ని శక్తులు సంపాదించుకోవటం, వాటిని సదా చేతిలో ఉంచుకోవటం మనకి ఎంతైనా ముఖ్యం. దేవుళ్ల అనుగ్రహం పొంది, వాళ్ల వశంలో ఉంటున్న శక్తుల్ని మనం సంపాదించే తీరాలి. నువు వెంటనే పరమేశ్వరుణ్ణి గురించి తపస్సు చెయ్. ఆయనవల్ల వరాలు పొంది, త్రిలోకశూరుడవై వర్ధిల్లు!—" అని ఆచార్యుడు దీవించాడు.

సింధు తల్లిదండ్రుల దగ్గర సెలవు తీసుకున్నాడు. దీవెనలందుకున్నాడు. బయల్దేరాడు. అరణ్యాలు చేరుకున్నాడు. కఠోరమయిన తపస్సు మొదలెట్టాడు. రోజులు, వారాలు, మాసాలు, వత్సరాలు గడిచినా సింధు పట్టు వదలక దీక్షగా తపస్సు చేస్తూనే ఉన్నాడు.

పసివాడు చేసే ఈ ఘోర తపస్సుకి కైలాసం దద్దరిల్లిపోయింది. పరమశివుడు ఉన్నపాటున భూలోకానికి దిగి వచ్చాడు. పార్వతీదేవికి మనసులో కలవరం పుట్టింది!—

* * *

"కుమారా, సింధూ!—లే. నీ తపస్సుకు మెచ్చాను. నీ కోరిక తెలుసుకున్నాను. నీ ఇష్ట ప్రకారం ముల్లోకాల్లోనూ నీకు ఆధిపత్యం ఇస్తున్నాను. సాధు రక్షణ, దుష్టశిక్షణ చేస్తూ, జనసమ్మతంగా పరిపాలన సాగించు. సుఖంగా ఉండు. అయితే, ఒక్కమాట మాత్రం జ్ఞాపకముంచుకో—నీ పరిపాలనలో ఎప్పుడయినా సాధు బాధ కలిగిందంటే, ఆ క్షణమందే నిన్ను మింగే వాడు అవతరిస్తాడు. జాగర్త!—" అని చెప్పి మాయమయ్యాడు, మహేశ్వరుడు.

సంతోషంతో తన నగరం చేరుకున్నాడు, సింధు.

పిన్నవాడు విజయవంతంగా తిరిగి వచ్చినందుకు పరమానందభరితులయ్యారు, తల్లిదండ్రులు.

కులగురువు శుక్రాచార్యులు పసివాణ్ణి చేరదీసి, "నాయనా!—ఇప్పుడు నువ్వు సింధువి కాదు. జయసింధువి. విజయసింధువి. విజయలక్ష్మి నిన్ను వరించింది. మన కులానికే కష్టాలు గట్టెక్కాయి," అంటూ బాలుణ్ణి అట్టే గుండెలకు హత్తుకున్నాడు!—

ఈ సంతోష సమయంలోనే పట్టాభిషేక మహోత్సవానికి సుముహూర్తం పెట్టాడు ఆచార్యుడు.

ఆ సుముహూర్తమందు చక్రపాణి దంపతులు ముద్దుల పట్టికి అతి వైభవంగా పండుగ చేసుకున్నారు.

పట్టాభిషేకపు వేడుకలు ముగియడంతో రాజ దంపతుల బాధ్యతలు కూడా తీరినట్టయింది. అందుచేత, ఉగ్రాదేవితో సహా చక్రపాణి తపస్సు చేసేందుకు అడవులకు వెళ్లిపోయాడు.—

* * *

గద్దె ఎక్కిన సింధురాజు బుద్ధికుశలులయిన ఇద్దరు మంత్రుల్ని నియమించుకున్నాడు. అపారమయిన సైనిక బలాల్ని సమకూర్చుకున్నాడు. భూలోకమంతా ఆక్రమించి వేశాడు. పాతాళలోకం వశపరచుకున్నాడు. స్వర్గలోకాన్ని జయించి, దేవేంద్రుణ్ణి ఖైదు చేశాడు.

కొంతకాలం స్వర్గలోక సౌఖ్యాలన్నీ అనుభవించాడు. తరువాత అక్కడి పరిపాలనకు ప్రత్యేకించి ఇద్దరు మంత్రులను ఏర్పరిచాడు. తను మళ్లీ గండకనగరం చేరుకున్నాడు.



# కార్యసిద్ధి

గండకీ నగరంలో వుండి, ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలన సాగిస్తున్న సింధు మహారాజు వద్దకు రాక్షస యువకులు వచ్చి చేరారు. దాయాదులయిన దేవగణాలవల్ల, రాక్షస కులం అనుభవిస్తూ వచ్చిన అవమానాలూ అగచాట్లూ అన్నీ పూసగుచ్చినట్లు ఏకరు పెట్టారు. ఆ పరాభవాలకు తగిన ప్రతీకారం చేసే తీరాలని రాజుకు మరిమరి నూరి పోశారు.

వినగా వినగా వాళ్ల మాటలు నిజమే అనిపించాయి జయ సింధుకు. వెంటనే, కులగురు వయిన శుక్రాచార్యుడికి కబురు చేశాడు. ఆయన్ని సలహా చేశాడు. నిజానిజాలు తెలుసుకున్నాడు. దేవ గణాలను తనకు జాతి విరోధులు గానూ, జ్ఞాతి విరోధులుగానూ ఎంచి కక్ష కట్టాడు. వాళ్లపైన కసి తీర్చుకోవడమే కర్తవ్యమని నిశ్చయించాడు. రాజు తలపెట్టిన ఈ ఉద్యమానికి యువకులంతా సుముఖులయ్యారు. ఉత్సాహం చూపారు. తోడు పడ్డారు.

ఫలితంగా —

దేవ గణాలను రాక్షసులు పెట్టే బాధలు దిన దినానికీ మిక్కుటమయ్యాయి. భరించలేకపోయారు. తిన్నగా మహా విష్ణువు వద్దకు పోయి మొరపెట్టుకున్నారు. సింధురాజు చెరలో పడివున్న దేవేంద్రుడు తుమ్మెద రూపంలో తప్పించుకు పోయి, విష్ణుమూర్తి పాదాల మీద పడ్డాడు.

'ఓహో, వ్యవహారం ముదురుతూ వుందే' అని చెప్పి విష్ణుమూర్తి తన సైన్యాలను తరలించాడు. సింధురాజు మీదికి యుద్ధానికి వెళ్లాడు.

గండకి నగరానికి అల్లంత దూరాన విడిసి వున్నాయి వాసుదేవుడి సేనలు. అప్పటికప్పుడే బ్రహ్మాండమయిన సైన్యంతో వచ్చి ఎదుర్కొన్నాడు సింధురాజు.

సింధురాజుకీ, వాసుదేవుడికీ మధ్య హోరా హోరీ యుద్ధం జరిగింది.

చివరకు ——

మహావిష్ణువు సింధురాజుతో వైరం పెట్టుకోలేదు. సరికదా, అనేక విధాల అతన్ని మెచ్చుకున్నాడు. మెచ్చుకుని, "నాయనా, సింధూ! — సాటిలేని నీ పరాక్రమానికి సంతోషించాను. నీకేం కావాలో కోరుకో —" అంటూ బుజ్జగించ బోయాడు! —

సింధురాజు అహంభావానికి అంతులేక పోయింది. "అయితే—నువ్వూ, నీ పరివారమూ కలిసి ఇక్కడే ఉండిపొండి. నా నగరానికి కాపలా కాయండి" అని శాసించినట్లుగా అన్నాడు.

ఇంకేముందీ ? —

మహా విష్ణువే ఇలా చిక్కుకు పోవడంతో జగత్తు అంతా తలకిందులయింది. అందరికీ దిక్కయి వున్న దేవుడికే దిక్కు లేకపోయె! —

దేవ గణాలకు కష్టాలు ఎక్కువయ్యాయి. ఋషి గణాలకు జప తపాలు సాగలేదు.

ముల్లోకాల్లోనూ హరినామ స్మరణకు బదులుగా సింధు నామస్మరణమే సదా వినిపిస్తూ వుండాలని రాజు శాసించాడు.

ఈ శాసనాన్ని ధిక్కరించిన వాళ్లెవరయినా సరే యమయాతనలు అనుభవించి తీరాల్సిందే! —

రాక్షస యువకులకు ముఖ్యంగా మునుల మీదే కసి! — వాళ్లు ప్రత్యేకించి రాజు వద్దకు వెళ్లి:

"ప్రభూ! — ముక్కు మూసుకుని కొంగ జపాలు చేసే ఈ ఋషుల్ని మనం ఎంతమాత్రం నమ్మకూడదు. వాళ్లని ఒక కంట కనిపెట్టి వుండాలి. మన మీద ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పడం, దేవ గణాలను మన మీదికి ఉసి గొల్పడం వీళ్లకి మొదటి నుంచి అలవాటు. వీళ్ల మూలాన్నే మనకూ దేవతలకు వైరం. ఈ గెడ్డపు వాళ్లకి మాట్లాడితే ముక్కు మీద కోపం. చేతనవును గదా అని అమాయకుల్ని శపించేస్తూ వుంటారు. పనీ పాటూ లేని ఈ సోమరి పోతులను ముందు అదుపులో వుంచితే తప్ప మన రాజ్యంలో అల్లర్లు అణగవు" అని నచ్చజెప్పారు.

సింధురాజు తల వూపాడు.

తక్షణమే తలారులు పోయారు. ఎక్కడెక్కడి మునులనూ, వెతికి, పట్టి కట్టి తెచ్చి ప్రభువు ఎదుట పెట్టారు. రాక్షస యువకులు వచ్చి ఋషులనూ, దేవ గణాలనూ ఇష్టమొచ్చినట్లు పీడించ సాగారు. వాళ్లు పెట్టే హింసలకు అంతూ పొంతూ లేదు. సింధురాజుకూ, పరివారానికీ ఇదంతా ఎంతో ఆనందంగా వుంది! —

ఒకనాడు ——

వాళ్లంతా హింసాకాండలో ఇలా తన్మయులై వుండగా — మిన్ను విరిగి మీద పడినట్లుగా ఏదో భయంకరమయిన శబ్దమయింది! —

ఏమిటా అని అందరూ నిశ్చేష్టులై చూశారు. అప్పుడు భీషణ వాక్కులతో అశరీరవాణి ఇలా పలికింది:

"ఓయీ సింధూ! — నీ రాజ్యంలో సాధు బాధ మితిమీరి పోతూంది. నిన్ను మింగేవాడు కైలాసంలో పుట్టి పెరుగుతున్నాడులే! — జాగ్రత్త!! — "

సింధుకు తన చుట్టూ వున్న ప్రదేశమంతా కంపించినట్లు అనిపించింది. ఇప్పుడు అశరీరవాణి పలికిన పలుకులూ, ఆనాడు పరమేశ్వరుడు చెప్పిన మాటలూ ఒక్కటే! — సరిగ్గా ఒక్కటే! — ఈ మాటల అంతరార్థం జయసింధుకి ఒక్కడికే తెలుసు! —

అయితే —

ప్రాజ్ఞతలేని రాక్షస యువకులు మామూలు సామరత్యంతోనే ప్రసంగాలు సాగిస్తూ వచ్చారు:

"రాజా! — దేవతలాడే బూటకపు నాటకాల్లో ఇదొకటి. ! — ఆ పిరికి పందల మాటలు మనమూ పట్టించుకోవడం ? — ఎన్నాళ్లా తెర వెనక భాగోతాలే గాని, ఎదటికి వచ్చి ఒక్క మాటయినా అనలేరుగా వాళ్లు! — ఎక్కడో ఎవడో పుట్టాడట, వాడికి మనం భయపడాలిట! — ఏం విడ్డూరం!! — జయసింధునే చంపగలవాడు పుట్టటమా ? — ఎవరు నమ్ముతారు ఈ పిచ్చి కబుర్లు ? —" అని మహారాజుని ఉత్సాహ పరచాలని చూశారు.

ఇందులోని నిజానిజాలు తెలిసిన జయసింధు నిదానంగానే సమాధానం చెప్పాడు:

"మీరన్నదీ నిజమే. దేనికి గాని మనం భయపడవలసిన పని ఎంతమాత్రం లేదు. అయినా — కైలాసంలో, నన్ను మింగేవాడు అవతరించాడన్న మాట. ఎందుకు పుట్టిందో పుట్టింది. మన మెందుకు కాదనాలి ? — ఇదెంత వరకు నిజమో తెలుసుకుంటే తీరిపోతుంది" అన్నాడు.

రాజు చెప్పిన మాట రాక్షస యువకులకు తల కెక్కలేదు. దేవ గణాలపైన గల క్రోధావేశాలు కొంచెం కూడా వాళ్లని వదల్లేదు.

మహారాజా ! — ఆ గొడవ మాకు వదిలి పెట్టండి. మేం చూసుకుంటాం. వీలయినంత వరకు ఆ నిసుగును ప్రాణాలతోనే పట్టివేస్తాం. అంతగా సాధ్యం కాకపోతే, హతమార్చి అయినా తెచ్చి తమ యెదుట పెడతాం. వాణ్ని ఏలికకు అప్పగించే భారం మాది. మాయలూ, మంత్రాలూ, జిత్తులూ, ఎత్తులూ, చిట్కాలూ, చిల్లంగులూ, ఇంద్రజాల మహేంద్రజాల విద్యలలో ఆరితేరిన హేమాహేమీలు ఎంతమందిలేరు, మన ఆస్థానంలో ? — అటువంటప్పుడు దీన్ని గురించి తమకు లేనిపోని దిగులెందుకు ప్రభూ ? — " అంటూ వాళ్ళు సింధురాజుకు ధైర్యం చెప్పారు.

అంతమందీ కలిసి ఎంతగా ధైర్యం చెప్పినా, సింధురాజుకు మనసు కుదుట పడలేదు. ఉన్న పాటున మంత్రివర్గాన్ని సమావేశ పరిచాడు.

" విన్నారు కదా ఆకాశవాణి హెచ్చరిక ? — ఇప్పుడిక మనం ఉపేక్షించి వూరకుండటానికి వీల్లేదు. ఆలోచించి చూడగా — నా కొక్కటే ఉపాయం తోస్తూంది. కైలాసంలో కంటికగపడిన శిశువు నల్లా చంపి పారెయ్యండి అలా చేస్తే మనకెటువంటి భయమూ ఉండదు " అని చెప్పి వాళ్ళని తొందర పెట్టాడు.

మంత్రులు సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

(సశేషం)




అనగా, అనగా ఒక రాజుగారు. ఆ రాజుగారికి అనుమానం జాస్తి. ఏదీ నమ్మటానికి ఇష్టపడేవాడు కాదు. అయితే, ఎవరో ఏదో చెబుతూ ఉంటే వినాలని సరదా; అందుకని ఒకరోజు ఇలా ప్రకటన చేయించాడు—"తాము నమ్మలేని సంగతి ఎవరయినా, ఏదయినా చెప్ప గలిగితే తనకూతురుని ఇచ్చి పెళ్ళి చేసి అర్ధరాజ్య" మిస్తానని.

ఇంకేముంది, కథలు చెప్పేవారు వందలు, వేలు వచ్చి దిగారు! విచిత్రమయిన కథలు చెప్పటానికి సంసిద్ధులయ్యారు. రాజుగారు కొంచెం ఆలోచించి, మరొక ప్రకటన చేయించాడు. "తాము నమ్మిన కథ చెప్పిన ప్రతివారి తలా ఎగిరి పోగల"దని,

ఈ షరతుచూసి భయపడి చాలా మంది వెనక్కి తగ్గారు. మిగిలిన వారు ధైర్యంచేసి వింతవింత కథలూ, విశేషాలూ చెప్పటం మొదలు పెట్టారు, కాని, పాపం రాజుగారు అన్నిటినీ "నమ్ముతున్నా" మంటూ వారి తలలు తీసేశారు.

కొంతకాలం గడిచింది. హాన్స్ అనే ఒక బీదవాడు రాజుగారి ప్రకటన విని, అసలు రాజుగారి కూతు రెలా ఉంటుందో చూసి మరీ ప్రయత్నం చేద్దామనుకున్నాడు, రాజకుమార్తెకేం, చాలా అందంగా ఉంది! సరే, అనుకుని హాన్స్ రాజ ప్రాసాదంలోకి వెళ్ళాడు.

"బాగానే ఉంది కాని నీ తల విషయం ఆలోచించావా?" అని అడిగాడు రాజుగారు హాన్స్ విన్నపం విని.

"దాని కేముందలెండి! కథ చెప్తా వింటారుగా?" అని ప్రారంభించాడు హాన్స్.

"ఒకరోజు వెళ్ళి పొలంలో కొన్ని విత్తనాలు నాటాను. పొలం ఈ మూల మొదలెట్టి అటు పోయానో లేదో మొక్కలు మొలిచాయి! మొలవటమే కాదు, ఒకటి ఒక పెద్ద వృక్షం అంత ఎత్తున ఎదిగేసింది!"

["నమ్మేశాను!" అన్నాడు రాజుగారు.]

"ఉండండి, సాంతం చెప్ప నియ్యండి.........ఆ పెద్దమొక్కని ఎక్కటం ప్రారంభించాను ఎక్కగా, ఎక్కగా అలిసిపోయి కిందికి చూశాను, అంతే భయం వేసేసింది. కొండలకన్నా, మబ్బులకన్నా పైన ఉన్నాను. ఆ భయంతో పట్టువదిలి కింద పడిపోయాను; అంత ఎత్తు మీదనుంచి పడ్డానేమో, నా బరువుకి భూమిలోపల, ఇరవయి అడుగులు, దిగిపోయాను! లాభం లేదనుకుని, గబగబ ఇంటికి పరిగెత్తుకెళ్లి ఒక పార తెచ్చుకుని తవ్వుకుని మరీ బయటపడ్డాను.........

["నమ్ముతున్నా!" అన్నాడు రాజుగారు మళ్లీ.]

"అప్పుడే ఎక్కడయింది...... మర్నాడు పొద్దునే వెళ్ళి చూద్దును కదా, మొక్క ఇంకా ఎదిగింది! నేరుగా స్వర్గం చేరుకున్నట్లే ఉంది. ఎందుకయినా మంచిది కొన్నిరోజు లాగితే నిజంగానే స్వర్గలోకందాకా ఎదుగుతుంది కదా, అనుకుని ఓపిక పట్టి కొన్నిరోజుల తర్వాత పైకి ఎక్కాను. ఒక సంవత్సరం పట్టిం దనుకోండి!" [అని ఆగాడు హాన్స్

"ఇదీ నమ్ముతా!" అన్నాడు రాజుగారు.]

"సంవత్సరం అయిందా? చివ రికి స్వర్గం చేరుకున్నా. ఆహా, ఎంత బావుందనుకున్నారు! దేవ లు, సంగీతం, వైభవం ఏమని చెప్పను? ఎందరో పాతస్నేహితులు కని పించారు. కొందరు వెండివాహ నాలలో షికార్లు చేస్తున్నారు. మా తలిదండ్రులూ కనిపించారు. వారేమో బంగారు వాహనంలో ఎక్కి తిరుగుతున్నారు.........

"అలా నడిచివెళ్లాను. మీ తలి దండ్రులు కనిపించారు మహారాజా- పాపం చింపిరి గుడ్డలు కట్టుకుని పందులు తోలుతున్నారు ..."

["అబద్ధం! నే నమ్మను!" అనే శాడు రాజుగారు కోపంతో.]—

"అలా గంటారేమిటి, నే చూస్తేనూ?" అన్నాడు హాన్స్ నవ్వుతూ. "కాని మీమాట సంగ తేమిటి? నా పెళ్లైపోయిందా? రాజ్యంలో సగం మాటేమిటి?"

ఇంకేముందీ, రాజుగారు, తమ మాట నిలబెట్టుకున్నారు అంతే...

★

## మీరు చెప్పగలరా?

"తాతయ్యా! తాతయ్యా! ఇవాళ నా పుట్టిన రోజు తెలుసా!" పరుగెత్తు కుంటూ వచ్చాడు గోపీ ప్రొద్దున్నే.

"ఓహో; అయితే ఇంకేం? ఇవాళ స్కూలుకు పోవలసిన బాధ తప్పుతుందన్న మాట, అంతేగా!" అన్నాడు తాతయ్య.

"అదిగాదు తాతయ్యా, ఇవ్వాల్టినుంచి నా వయసు ఒక సంవత్సరం పెరుగుతుంది గదా? నే నొక తమాషా కనుక్కున్నాను ఇవ్వాల్టి నా వయసూ, నేను పుట్టిన సంవత్సరంలోని చివరి రెండు అంకెలూ, సమాన మౌతున్నాయి చూశావా?" అన్నాడు గోపీ ఏదో గొప్ప విషయం కనిపెట్టినట్లు.

"భేష్! బాగానే ఉంది" అన్నాడు తాతయ్య "కాని నువ్వు నమ్ముతావో నమ్మవో, నా విషయంలో కూడా అదే జరి గింది. ఇవ్వాల్టి నా వయస్సు, నేను పుట్టిన సంవత్సరంలోని చివరి రెండు అంకెలు సమాన మౌతున్నాయి, తెలుసా?"

"నేను ఛస్తే నమ్మను." అన్నాడు గోపీ. కాసేపాలో చించి, "అది అసంభవం."

1. మీరు చెప్పండి: అది సంభ వమో అసంభవమో? అదే సంభవమైతే వాళ్ళిద్దరి వయసు లెంత? ఈ సంఘటన జరిగింది 1930 లో అనుకోండి.

2. ఒక రైల్వేలైను మీద 25 స్టేషనులున్నాయి. ఈ స్టేషను లకు టిక్కెట్లు అచ్చుకొట్టి అంద చేయవలసిన అవసరం వచ్చింది. ఈ 25 స్టేషనులలో ఏ స్టేష నుంచి ఏ స్టేషనుకు పోవటాని కైనా టిక్కెట్టు అందేలా చేయాలంటే మొత్తం ఎన్ని రకాల టిక్కెట్లు అచ్చు వేయాలి?

సేకరణ: డి. నారాయణరావు

జవాబులు:

1. గోపీ వయస్సు 15 సం. పుట్టింది—1915. తాతయ్య వయస్సు 65 సం. పుట్టింది 1865.

2. ప్రతి ఒక్క స్టేషన్ నుంచి మిగతా 24 స్టేషనులకు టిక్కెట్లు కావాలి. కాబట్టి మొత్తం 25 × 24=600 రకాల టిక్కెట్లు అచ్చు వేయించాలి.




"నన్ను కోర్టులో హాజరు పరిచినప్పుడు నీ కనులు ఆనందంతోనూ, గర్వంతోనూ మెరిసిపోయాయి. నిన్ను నీ పై అధికారి అభినందిస్తూంటే నర నరాల్లో నీ రక్తం వేడెక్కి ఉరకలు వేసి ప్రవహించింది. ముసలితనంలో కూడా నీ మొహంలోని ముడుతలు క్షణంపాటు మాయమైనాయి. నామీద శిక్ష ధృవీకరింపబడుతూంటే నీకు ఆనందంతో కళ్ళు చెమ్మగిల్లాయి. అవును. నాకోసం నువ్వు ఇన్నాళ్ళూ పడిన శ్రమా ఫలించింది. పై అధికారులు నీకు ఇచ్చిన పనిని తెలివిగా నెరవేర్చి నువ్వు వారిని సంతృప్తి పరిచావు.

"నిజమే. ఇది నిజంగా సామాన్య విషయంగాదు. దాదాపు పదేళ్ళపాటు ప్రజలకీ, ప్రభుత్వానికి కంటకప్రాయమైన ఒక దోపిడిగానిని చాకచక్యంగా బంధించి అతనిమీద నేరాలు ఆరోపించి ఋజువు చేయించావు. నీ ముప్ఫయి సంవత్సరాల సర్వీసును విశ్వాసపాత్రుడవుగా, సమర్థతతో నెరపినావనుటకు ఉద్యోగ విరమణకాలం దగ్గర పడుతున్న ఈ సమయంలో నువ్వు ఒనర్చిన ఈ సాహస కార్యం నిదర్శనం కాగలదు. దీనికి నిన్ను అభినందిస్తున్నాను."

"స్కౌండ్రల్!" విసురుగా కాగితాలని నేలకేసి కొట్టాడు. ఇనెస్పెక్టర్ రాజారావు. ఇదేమాటలు ఓ పై అధికారి రాసిఉంటే అతను ఎంతయినా ఆనందించి ఉండేవాడు. కాని తనచేత పట్టుబడి శిక్షించబడిన ఒక దోషినుంచి తనకి అభినందన సందేశమా? అతనికి కోపంతోబాటు ఆశ్చర్యం కూడా కలిగింది. ఇలాంటి సంఘటన తన ముప్ఫయి సంవత్సరాల సర్వీసులో ఎక్కడా వినలేదు. కనలేదు.

నౌకరు తలుపు తోసుకుని లోనికివచ్చాడు కాఫీ "ట్రే"తో. ట్రే స్టూలుమీదపెట్టి పక్కసర్ది దుప్పట్లు మార్చాడు. కిటికీ తెరలు దించి తలుపు మూశాడు. "యాష్‌ట్రే" తీసుకెళ్ళి శుభ్రం చేసి తీసుకొనివచ్చి తిరిగి యధాస్థానంలో ఉంచాడు. సిగరెట్ 'పాకెట్'లు మరో రెండు తెచ్చి టేబులు

పోయిందిట,తన్ను తెలిసిన వాళ్ళెవరూ లేని చోటికి!

అంతవరకూ తను చదువుకున్న చదువు జీవితానికి ఆధారం చేసుకుని ఒక ఎలిమెంటరీ స్కూల్లో చదువు చెబుతూ నన్ను చూసుకుంటూ కాలం గడిపేదిట. కాని విధి చూసి ఓర్వలేక పోయింది. మూలిగే నక్క మీదనే పడుతుంది తాటి పండు. నేను ఐదో తరగతి చదువుతూండగా ఆ ప్రాంతాల భయంకరమయిన క్షామం సంభవించింది. దానికి తోడు మశూచి విపరీతంగా పోసి అమ్మ రెండు రోజులలో తన బ్రతుకుచాలించింది. ఆ సమయం లోనే నాకూ మశూచి పోసి, ఒక కన్ను పువ్వేసి పోయింది. తరతరాలుగా స్త్రీ మీద పురుషుడు చేస్తున్న అక్రమాలకి ప్రతిబింబమయిన నా మొహం మీది ఈ మచ్చలు నా తరువాతి జీవితానికి సూచన లై ఉద్భవించాయి. పుడుతూనే 'జన్మదాత' జీవితంలో అశాంతిని సృష్టించి ఆమె చని పోయినా నేను మాత్రం మొండిగా బ్రతికే ఉన్నాను.

నన్ను ఆ నాల్గు రోజులూ చూసుకున్నారు. ఎవరు మాత్రం ఎన్నాళ్ళు ఆదరించగలరు అనాధుని? ఎవరో పుణ్యాత్ములు ఆవిడకి అంత్యక్రియలు జరిపి పుణ్యం కట్టుకున్నారు. చనిపోయినప్పుడు ఆవిడ నాకు వదిలి పోయిన ఆస్తి ఒక వజ్రపు ఉంగరమూ, అమ్మదీ నాన్నదీ కలిపి తీసిన ఒక ఫోటోనూ. అవి మాత్రం పదిల పరుచుకున్నాను. ఇవి మాతండ్రి (?) నాతోబాటే మా అమ్మకిచ్చిన కానుకట.

అంతే నా జీవితం తెగిన గాలి పటం చందాన అయింది. నా అనే వాళ్ళు ఉన్నా ఇప్పుడునాకు తెలియదు. పోల్చుకోలేను. వాళ్ళు నన్ను అసలే పోల్చుకోలేరు. నాకు నాన్న లేడు. ఉన్న అమ్మ పోయింది. ఏకాకిని అయి పోయాను. ఎవరికోసం బతకాలి నేను. ఎందుకు? గమ్యం లేని ప్రయాణమయింది నా బ్రతుకు. దానికి దారి తెన్నూ లేదు. బజారు మనిషి నయినాను.

ఆకలేసినప్పుడు చిన్న చిన్న దొంగతనాలు చేసేవాడిని. తరువాత వయసుతో బాటు నా వృత్తి, ఆశా పెరిగాయి, ఖర్చెక్కువయింది. పెద్ద దొంగతనాలు మొదలు పెట్టాను. ఈ ప్రపంచమంతా నా శత్రువు. దానిమీద తీవ్ర ప్రతీకారం తీర్చుకోవాలనిపించింది. ఆరని పగ నాలో రగిలింది. ఈ ప్రపంచం నాకు తీరని అన్యాయం చేసినట్లు, దానికి ప్రతిగా పగ తీర్చుకునే వాడిని. నాలోని మమత ప్రేమా మొద్దుబారి పోయాయి. హృదయం మొండి బండలా మారి పోయింది.

నేను చేసిన దోపిడీలతో, హత్యలతో నిన్ను విసుగెత్తించ దలచలేదు. నా పగలో ఎందరో అధికార్లు కూడా ఆహుతి అయ్యారు. కాని ఇన్స్పెక్టర్! నువ్వు నన్ను పట్టుకున్నావు. ఎందుకో గాని నువ్వు న్యాయ రక్షణకి 'ప్రతిబింబ' మనిపించింది. నిన్ను చంపాలనిపించలేదు. నీకూ—న్యాయానికీ—లొంగి పోవాలనిపించింది. కారణం అడిగితే చెప్పలేను. కొన్ని పనులకి కారణాలు ఉండవు.

నేను చేస్తున్నది తప్పని నాకు తెలుసు. కాని చేయకుండా ఉండలేక పోయాను. కనుకనే శిక్ష అనుభవించటానికి నేను బాధ పడటం లేదు. నేరము చేశాను గనుక శిక్ష అనుభవించాలి. అది సంతోషంగా స్వీకరిస్తాను. ఇన్స్పెక్టర్! నేను నలుగురికీ తెలిసేటట్టు నేరం చేశాను. ఇప్పుడు నా చరిత్ర విన్నావు గదా! ఇందులో ఎవరికీ తెలియకుండా, కనబడని నేరాలు చేసినా ఇప్పటికీ పెద్ద మనుషులుగా చలామణీ అయ్యేవాళ్ళు ఉన్నారు. వాళ్ళని శిక్షించటానికి మీ చట్టం ఏం ఏర్పాట్లు చేసింది? వాళ్ళెవరో గ్రహించగలిగి ఉంటావు ఈ సరికి దీన్ని గురించి ఏమైనా చెయ్యటం నీ వలనా, నా వలనా కాదనుకో. ఎందుకంటే నీవు న్యాయ రక్షణ యంత్రాంగంలో ఒక భాగానివే. మరి నేను నేరం చేసి శిక్ష అనుభవించ బోతున్నవాడిని. దాన్ని గురించిమాట్లాడటానికి నాకు హక్కు లేదు. పశ్చాత్తాపంతో, శిక్షననుభవించడంతో నా పాపం ప్రక్షాళనం అవుతుంది. ముప్ఫయి అయిదేళ్ళకే మూరేళ్ళు నిండుతున్నందుకు నాకు బాధ లేదు. ఎందుకంటే ఈ జీవితం నేను కోరలేదు ఎప్పుడూ. అంటే ఈ జీవిత నాటక రంగంలో నాపాత్ర కొద్దిసేపే నన్నమాట. మా అమ్మలాగా. అయితే ఆమెను లోకం బాధ పెట్టింది. నేను లోకాన్ని బాధ పెట్టాను. అంతే తేడా.

ఇక పోతే ఈ నెల రోజులు నేను నీ రిమాండులో ఉన్న కాలంలో ఒక పని మాత్రం చెయ్యగలిగాను. నా తల్లి అత్యంత పవిత్రంగా చూస్తూవచ్చిన ఆ వజ్రపుటుంగరమూ, నా తల్లిదండ్రులఫోటోలూ ఉన్న చిన్న పేటికని ఎవరూ చూడకుండా నీ డ్రాయరు క్రింద ఉంచగలిగాను. ఈ ఉత్తరం చదవగానే దయచేసి నువ్వు ఆ పేటికని తెరిచి ఆ

ఉపాధ్యాయుడు : గాయకుడు అంటే అర్థమేమిట్రా?

విద్యార్థి : గాయపరుచువాడు! మేష్టారూ.

వై. కామేశ్వరరావు (మల్కాజెగిరి)

రెండు వస్తువులనూ కాల్చి వేయ వలసిందిగా కోరుతున్నాను. న్యాయానికి దగ్గరవాడవని నాకు నీమీద నమ్మకం ఉండటం వలన, నీమీద ఎందువలననో నాకు సద్భావం కలగటం వలన—కారణం అడిగితే చెప్పలేను—కొన్నిటికి కారణాలుండవు. నిన్ను నా అత్యంత సన్నిహితుడుగా భావించి ఈ పని నీకు అప్పగిస్తున్నాను. నువ్వు అని సంబోధించి చనువు తీసుకున్నందుకు క్షమించవలెను. మన ఇద్దర్ది మధ్య ఏదో తెలియని అనుబంధం ఉన్నదని నాలో ఏ మూలనో అనిపిస్తున్నది. అందువలననే ప్రేమగా పిలవాలని పించింది. సన్నిహితత్వం కోరాను. చిత్రంగా లేదూ?"

ఉత్తరం ముగించి గాఢంగా నిట్టూర్చాడు రాజారావు. ఆశ్చర్యం వేసింది. ఎంత విచిత్రమయినకోరిక. ఏ పాపిష్టి అనుబంధం, తనకీ వద్దనుకున్న జన్మ ప్రసాదించిందో ఆ అనుబంధ చిహ్నాలయిన ఆ రెండు వస్తువులూ గౌరవప్రదంగా రూపుమాపబడాలని అతను కోరుతున్నాడు. దానిలో ఈ నాటకంలో అతని పాత్ర తాలూకు చిహ్నాలు కూడా మాసి పోతాయి. ఆశ్చర్య పడుతూ కాస్సేపు కూర్చున్నాడు. తనకీ వాడికీ అనుబంధమా? "పూర్ క్రీచర్!" అని నవ్వుకున్నాడు. రాజారావులో ఆ రెండు వస్తువులనీ చూడాలని ఉత్సుకత కలిగింది. గబగబా లేచి డ్రెస్ మార్చుకున్నాడు. నౌకర్ని లేపి తలుపు వేసుకోమని చెప్పి జీపుని రోడ్డు మీద పరుగెత్తించాడు..

చలికి రాత్రి ఒళ్ళు ముడుచుకునినిద్ర పోతున్నది. పావు గంటకి స్టేషన్ చేరుకున్నాడు రాజారావు. తన ఆఫీసరు కుర్చీలో కూర్చుని ఏదో రాసుకుంటున్నాడు. బయట విజిటర్స్ రూములో ఎవరో కూర్చుని ఉన్నారు. నైట్ డ్యూటీ ఆఫీసరు శివంకూడా ఉన్నాడు. కొంచెం ఆశ్చర్య పోయి అతనికి "విష్" చేశాడు. "ఏమిటి రాజారావుగారూ!" ఇప్పుడెందుకొచ్చారన్నట్టు కన్నెగరేశాడు అతడు. "ఏం లేదండీ. నిద్ర పట్టక పోతే కాసేపు శివంతో మాట్లాడి పోదామని వచ్చానండి." అని శివం దగ్గరకు వెళ్ళాడు.

"ఐ సీ...!" అని ఆయన తలవంచుకుని ఏదో రాసుకోసాగాడు. శివంకోసం వచ్చానన్న రాజారావు తిన్నగా శివం దగ్గరకు వెళ్ళక తన టేబులు దగ్గరకు వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. ఇది గమనించి ఆఫీసరు తిరిగి రాసుకో సాగాడు.

రాజారావు కుర్చీలో కూర్చుని టేబులు క్రింద చెయ్యి పెట్టి తనకు కావల్సిన దాని కోసం వెతికాడు. చిన్న పేటిక దొరికింది కాసేపు వెతికాక. అది తీసుకుని, ఆఫీసరు టేబులు దగ్గరకు వచ్చి "సెల్యూట్" చేసి "ఖైదీ నం. 111 ని ఉరి తీశారా సార్" అని అడిగాడు. "అవును. ఏం?" అన్నాడు తల ఎత్తి ఆఫీసరు.

"ఏం లేదు. అతను చిత్రమయిన వ్యక్తిలా ఉన్నాడు. ఈ ఉత్తరంలో" అంటూ పేటిక తీసి ఫోటో, ఉంగరమూ బయటికి తీసి ఆ ఫోటో వంక చూడ సాగాడు అదే పనిగా.

"ఓహో ఉత్తరంలో...?" అని "ఏమిటి చూస్తున్నారు?" అని చేతిలో ఫోటో తీసుకుని పరీక్షగా చూడసాగాడు.

రాజారావు మొహం తెల్లగా అయింది. వణికి పోతున్నాడు. చేతిలో ఉంగరం తీసుకుని దానివంకే వెర్రిగా చూడసాగాడు. అతనిలో తీవ్ర చలనం కలిగింది. పిచ్చిగా చూస్తూ నిలబడి పోయాడు. "ఊఁ ఏమండీ? ఈ ఫోటో మీదే ననుకుంటాను. ప్రక్కన ఎవరు? చిత్రంగా ఉంది? ఆవిడ మీ భార్యా? ఆవిడ ఇలా ఉండదే?" అంటూ తల వంచుకుని క్రీగంట చూస్తూ చెప్పుకు పోతున్నాడు.

ఇంతలో ప్రక్క గదిలోంచి తలనెరిసిన, సూటు వేసుకున్న ఒక ముసలాయన ఆయాసపడుతూ వచ్చి రాజారావు కొరుకుతూన్న వజ్రపు ఉంగరాన్ని విసురుగా కొట్టాడు. ఉంగరం ఎగిరి వెళ్ళి శివం టేబులు మీద పడింది. ఇది చూసి శివం ఆయన మీదికి రాబోయాడు ఉద్రేకంగా. గవర్నమెంట్ ఆఫీసర్ల మీద, ఆఫీసులోనే దౌర్జన్యమా?

హఠాత్తుగా ఆఫీసరు ఉరుములా గర్జించాడు. ఇద్దరు ఎటెన్షన్ పోజుకొచ్చి సెల్యూట్ కొట్టారు.

ప్రక్క గదిలోంచి వెక్కిళ్ళు వినిపిస్తున్నాయి. ఎవరో స్త్రీ ఏడుపునాపుకుంటున్నది ఆఫీసరు చెప్ప సాగాడు. "మిస్టర్! రాజారావు. తలచుకుంటే నిన్ను ఆత్మ హత్యా నేరం కింద అరెస్టు చేయించ గలను. అయితే ఇందులో కొంత కల్పన జమ చేసి నిన్ను మభ్య పెట్టడానికి అనుమతి ఇచ్చి దానికి నేనూ కొంత బాధ్యుడనయినందున నన్ను క్షమించ వలసింది. ఈ ఉద్రేకంలో నువ్వు ఇంకో స్త్రీకి ద్రోహం చెయ్యబోయావు ఆలోచన లేకండా.

పోతే అసలుకథ ఆ విధంగా జరగలేదు. ఇక్కడ నీకు నిజం చెప్పాలి ఎందాక వచ్చి నీ ఆత్మ హత్య





అలసట పోయి
హుషారు కలగాలంటే...

మీరు అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే
## టీ

*సాటిలేని టీ!*

టాటా-ఫిన్లే టీ కంటె తృప్తికరమైనదేముంది! ఇందుకు కారణాలు:—

### తాజా టీ
తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

### పరిమళమైన టీ
అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

### ఉత్తమ టీ
టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** టీ త్రాగండి; ఆనందము అందుకోండి!

ఈ క్రింది రకాంలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లభిర్—బంగారు రంగు ప్యాకెట్
మిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్-నారింజ రంగు ప్యాకెట్
శావ్—నీలి రంగు ప్యాకెట్



ప్రయత్నాన్ని భగ్నం చేసిన వారు, ఒకే నాడు పిచే మోసగింపబడిన "శారదమ్మ" అన్నగారు. వయస్సు తెచ్చిన మార్పుల వలన మీరు పోల్చుకోలేక పోయారు గాని ఆయన మిమ్మల్ని పోల్చుకున్నారు. అయితే మిమ్మల్ని తిరిగి కలుసుకోవడం ఆ అన్నా చెల్లెళ్ళకి ఇష్టం లేదు. ఇక పోతే శారదమ్మగారి అబ్బాయి నాకు స్నేహితుడు. ఒక నాడు మాటల సందర్భంలో నాకు ఈ ఫోటో చూపించడం వలన, మిమ్మల్ని పోల్చుకో గలిగాను అయితే ఈ నాటకంలో వాళ్ళకి ఏమీ సంబంధం లేదు. నేనే రమ్మన్నాను.వాళ్ళని,

## నేరము–శిక్ష

మిమ్మల్ని చూపిద్దామని. ఇందులో కాస్త చొరవ తీసుకున్నాము నేను.

ఇక అసలు కథ ఏమిటంటే...."శారదా" అంటూ నాలుగడుగులు 'విజిటర్స్‌రూమ్' వయిపు పడవ సాగాడు రాజారావు అప్పటికే.

ఆఫీసరు గర్జించాడు. "సి.౧. సం. 1 నువ్వు ఆఫీసులో ఉన్న సంగతి మరిచి పోతున్నావు. స్టాప్.."

యంత్రంలాగా సావధానంగా నిలబడ్డాడు రాజారావు నిరుత్తరుడై:

"పూర్తిగా అసలు కథ వినండి. అందులో రాయబడింది కల్పనా కథ మాత్రమే. నిజంగా జరిగినది ఏమంటే ఆమె తిరిగి అన్న గారి వద్దకు వెళ్ళి బిడ్డను చూసుకుంటూ బిడ్డలోనే పతిని చూసుకుంటూ అదిశేషుడు వంటి అన్న ఉండగా కాకులవంటి లోకులు దరిచేరటానికి సాహసించలేదు. కన్నీళ్ళా బిడ్డని చూసుకుంటూ పూర్తిగా విరహాన్ని దుఃఖాన్ని భరించి ఉంది. నిన్ను శపించలేదు. పోతే ఉదయం ఉరి తీయబడినాడన్న నేరస్థుడు నీ కొడుకు కాదు. అతనికీ నీ ఈ కథకీ సంబంధం లేదు. అసలు అతన్ని ఉరి తీయలేదు. యావజ్జీవ కారాగార శిక్షగా మార్చారు.

"థాంక్యూ సార్!" సెల్యూట్ కొట్టాడు రాజారావు.

ఈ లోగా బయటి వాళ్ళిద్దరూ కారెక్కారు. రాజారావు గబగబా కారువద్దకు పరుగు తీశాడు. నోరు పెగల లేదు. లోపల శారద దుఃఖ మూర్తియై కూర్చుని ఉన్నది. ఆమె అన్నగారు ముఖం తిప్పుకుని కూర్చున్నారు. కారు స్టార్టు చెయ్యడానికి ఆత్రుత పడుతున్నాడాయన. రాజారావు మెదడు స్తంభించి పోయింది. ఏదో చెబుదామని చెప్పలేక అలాగే నిలబడి ఆమె మొహం లోకి చూస్తూ ఉండి పోయాడు. ఆ కాస్సేపు నిశ్శబ్దం మాట్లాడింది. కారు స్టార్టు అయింది. రాజారావు కళ్ళ వెంబడి కన్నీరు ధారాపాతంగా కురిసింది. "శారదా! నా కింత శిక్షా!" అని అరిచాడు పిచ్చిగా."నేరం చేసినప్పుడు శిక్ష అనుభవించక తప్పదు." ఆయన అరిచాడు కారులోంచి. కారు బయలు దేరింది. లోపల్నుంచి వెక్కిళ్ళు వినిపించాయి అతని గుండెల్ని పిండుతూ.

కళ్ళు తిరిగి పడిపోతూంటే శివం పరుగెత్తుకు వచ్చి రాజారావుని పట్టుకున్నాడు.

అప్పటికి ఆఫీసరూ వచ్చి సాయం చేశాడు. ఇద్దరూ కలిసి ఒక కప్పు కాఫీ పట్టించారు అతనికి.

"అయితే సార్! మీరు రేపు వెళ్ళి పోవడం ఖాయమేనా?" అడిగాడు శివం కుతూహలంగా. అప్పుడే అంతా నిశ్చయమై పోయింది. ఇప్పుడు చేసేదేమీ లేదు." అని నవ్వాడు ఆఫీసరు. కారు స్టార్టు చేసుకుని ఆఫీసరుగారు వెళ్ళిపోయారు. శివం, రాజారావుని ఇంటికి చేర్చాడు.

మర్నాడు ఆఫీసరుగారు ఛార్జి అప్పగించి వెళ్ళి పోయారు. రాజారావు ఇంట్లోనుంచి కదలలేదు. ఆలోచిస్తూ పిచ్చిగా ఉండి పోయాడు సెలవు పెట్టి.

గత రాత్రినుంచి నీరసంగా ఉన్న రాజారావులో సన్న సన్నగా ఉద్భవించి పెరిగి బలవత్తరమవుతూంది ఒక కోరిక. ఆఫీసరుగార్నడగటానికి సిగ్గు వేసింది. అతను బాగా నీరసించి పోయాడు అతని ప్రాణం గిలగిలలాడుతోంది దేన్నో తెలుసుకోవటానికి. శివం వచ్చాడు చూసి పోవడానికి.

మాటలు మింగుతూ అడిగాడు శివాన్ని. "మరి ...మావాడు...?" అంతకన్నా వివరంగా అడగటానికి సిగ్గేసింది. పకాలున నవ్వాడు శివం. "అయితే నువ్వు పోల్చుకోలా? ఇది వరకు శారదమ్మని మాడక పూర్వం తెలియలేదు గాని, ఇప్పుడు చూస్తే ఆవిడగారి పోలికలు, మన ఆఫీసరు..." అంతే అంత కలకు మూగవే విన్నాడు రాజారావు. మాట వినలేక పోయాడు.

★

## మయూరి

15 వ పేజీ తరువాయి

మురళీధర్‌ని తన్మయత్వంతో చూస్తూ కూర్చుంది. ఉపన్యాసాలు అయ్యాక మురళీధర్ లేచి "ఇప్పుడు మనకి రాధికగారు ఓ చక్కని పాట పాడి వినిపిస్తారు. అని ఎనౌన్సు చేసాడు. ఆమె కళ్లల్లోకి చూస్తూ."

తన పేరు వినపడటంతో ఈ ప్రపంచంలోకి వచ్చిన రాధిక ఎందుకో తెలియక ఖంగారుపడి పక్కవాళ్లు చెప్పగా అర్థం చేసుకుని ముఖమంతా ఎర్రగా చేసుకొని మురళీధర్ కేసి కోపంగా చూసి వెళ్లిపోయింది. ప్రేక్షకులంతా ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు. ఆశ్చర్య పోని కొందరు మాత్రం ఈలలు వేసి చప్పట్లు కొట్టారు. ఆ రోజు కార్య క్రమానంతరం మురళీధర్ రాధిక ఇంటికి వెళ్లాడు. కాని ఆమె మాట్లాడ్డానికి కూడా తిరస్కరించింది.

మర్నాడు మురళీధర్, నేను కాలేజీలో వెళ్తుంటే మేడమీద నుంచి "నెమలులు ఆడుతాయి కాని పాడలేవు అని తెలియదు పాపం!" అని మురళీధర్ పోటీదారుల సానుభూతి వచనాలు ఆ తరువాత నవ్వులు వినిపించాయి. తరువాత కనుక్కుంటే తెలిసింది ఆ రోజు మురళీధర్ దగ్గరకు వచ్చినవాళ్లు, మురళీధర్ పోటీదారుల స్నేహితులేనని.

అయినా మురళీధర్ అందరి దగ్గరా ఏమీ జరగనట్టు ఉండేవాడు. కాని రాధికను మాత్రం మనసులో మర్చిపోలేక పోయాడు. మనసులో రాధికను ఆరాధించటం మానలేదు. కాని బయటికి ఎప్పుడూ తను చాలా సరదాగా ఉన్నట్టు కనిపించే వాడు. అల్లాగే బి. యస్. సీ. పూర్తయింది.

నేను యమ్. యస్. సి. చదువుతానన్నా "అది చదివి మాత్రం ఏం చేస్తావు? ఉద్యోగము రావాలి కదా! పోనీ పి. హెచ్. డి. పూర్తి చేసినా వెంటనే సరియైన ఉద్యోగం దొరకదు. ఆస్తి పాస్తులు లేనివాళ్లం మనం. ఉద్యోగం దొరికే చదువు చదువుకోవాలి. నిన్ను ఎల్లకాలం నేను పోషించలేను" అంటూ నాన్నగారు నన్ను మెడలు వంచి బెంగుళూరులో ఇంజనీరింగ్‌లో జేర్పించారు. కాని వాలెడిక్టరీలో జరిగింది నాన్నగారికి తెలిసి నన్ను మురళీధర్‌కి దూరంగా ఉంచుదామని బెంగుళూరు పంపించేసారేమో అన్ని అనుమానం నాకుంది.

మురళీధర్ మాత్రం యమ్. యస్. సీలో జేరాడు. ఎప్పుడైనా ఉత్తరాలు వ్రాసేవాడు. రాధికకు తను అమాయకంగా వాళ్ల చేతుల్లో మోసపోయాడని నచ్చ చెప్పటానికి అనేకసార్లు త్నించినా "నా మాట కంటే మీరు వాళ్ల మాటకి ఎందుకు విలువివ్వాలి?" అని వినిపించుకోడం లేదని వ్రాసేవాడు.

ఇన్నాళ్లకి మళ్లీ ఈ ఉత్తరం.

* * *

ఉత్తరం గాలికి ఎగిరి కింద పడింది. దాని వెనకాతల ఏదో వ్రాసాడే!

"ప్రియమైన శర్మా!

నీకీ ఉత్తరం ఏప్రిల్ ఫస్టున అంది ఉండాలి. నా ఉత్తరాన్ని నమ్మి ఫూల్ అయ్యావా? హ! హా! హా!

రాధికకు పెళ్లి నిశ్చయమైన మాట నిజమే కాని. నాతో కాదు. మరొకళ్లతో. నేను ఇంటి వాణ్ణయే సూచనలంటావా! నాకీ వెర్రి కుదరాలంటే పెళ్లి చెయ్యాలని మా వాళ్లు అనుకుంటున్నారు. ఏ చెవులు తెగిన వాళ్లయినా పిల్ల నివ్వడానికి సిద్ధపడకపోతారా?

ఇట్లు
మురళీధర్—"

ఇదీ అతను చిన్న అక్షరాలతో వెనకాతల వ్రాసిన దాని సారాంశం. మురళీధర్ చాలా విచిత్రమైన వ్యక్తి.

తను సీరియస్‌గా తీసుకున్న విషయాల్ని తీసుకోనట్టు నటించి నవ్వి, నవ్వింపచేసే ప్రజ్ఞ చార్లీ చాప్లిన్ వేసే వేషాలకి ఉందంటారు. నా జీవితంలో తారసపడ్డ వ్యక్తుల్లో మురళీధర్ అటువంటి వాడు. వాళ్లు తమ దుఃఖాన్ని ప్రపంచానికి పంచి పెట్టరు. ఆనందాన్ని మాత్రమే ప్రపంచంతో పంచుకుంటారు. అతని ప్రేమ కథలు మిగిలిన వాటికంటే నాకు చాలా జాలికలిగిస్తాయి.

★

## కూలిన గోడలు

23 వ పేజీ తరువాయి

పలకబారి ఉన్నాయి. కోసుకు పోకుండా ఉంచే వాళ్లేనా?"

"ఎందుకైనా మంచిది. రేపు సపోటా కాయలు కోయించేస్తాను."

"ఇంకా ఎపడికిరా అన్ని దమ్ములు? మొన్న వెన్నెల రాత్రుళ్లు కాబట్టి అంతపని చేశారు. అమావాస్య రోజుల్లో ఈ కటిక చీకట్లో ఆ కాయలైనా కనపడాలా?"— విశ్వనాథం గర్వం వీగి పోయింది. ఆ రాత్రి సపోటాకాయలన్నీ మాయమయ్యాయ్. ఆ దొంగ వెధవ లెవరో దక్షిణం వైపు గేటుతాళం కూడా తీసుకు పోయాటు.

విశ్వనాథానికి మాట పెగల్లేదు. అన్ని కోణాల్లోనూ ఆలోచించాడు. బుర్రకేమీ అంతు చిక్కలేదు. సీతాపతి సూర్యం ఏమైనా ఆనవాళ్లు దొరుకుతాయేమోనని తోటంతా గాలిస్తుంటే మధూ గోపాలం వాళ్లకి చాలా సాయం చేశారు.

"ఇది గిదిగో మామయ్యా! ఇక్కడెవరో పరిగెత్తి ధభీమని పడిపోయినట్టు ఉంది చూడు" అరిచాడు మధు.

"నిజమే బాబాయ్. నువ్వు గమ్మని ఇక్కడికి రావాలి."— కేక వేశాడు గోపాలం.

"ఛ! వెధవల్లారా! చెట్లూ గేటూ అన్నీ ఇటు ఉంటే అటు ఆనమాళ్లెందుకు దొరుకుతాయిరా? ఇలా వచ్చి ఇటు చూడండి."— సీతాపతి కాస్త చిరాకులో ఉన్నాడు.

మధు గోపాలం నిజంగానే సపోటా చెట్ల పరిసరాల్లో కళ్లు ఇంతింత చేసుకుని వెదకటం ప్రారంభించాడు— ఒక చోట గోపాలం.... ఆగి పోయాడు.

మధుకేసి భావగర్భితంగా చూశాడు. మధు చూపులు గోపాలం చూపుల వెనకే ప్రయాణం చేసి..... నిల్చిపోయి.... ఈల! అది వేణుగాడి పంట్లాం జేబులో ఉండే ఈల! తెల్లగా కొట్ట వచ్చినట్టు కన్పిస్తోంది— "తీసెయ్" అన్నట్టు చూశాడు మధు.

గోపాలానికి ధైర్యం చాలలేదు— అటే వస్తూన్న సీతాపతికేసి చూపించాడు.

"ఎందుకురా అలా నిలబడి పోయారు? ఏమైనా దొరికిందా?"— సీతాపతి దూరం నుంచి అడిగి దగ్గిరికి రాసాగాడు.

గోపాలం ఆశలు వదిలేసుకుని వణికిపోయాడు "ఇక్కడేదో ముల్లు గుచ్చుకుంది మామయ్యా! ఆ దొంగలెవరో ముళ్లు పోసినట్టున్నారు."— మధు ఒంగి కుంటుకుంటూ రెండు బారల దూరం జరిగి ఈల మీద కాలువేసి మట్టిలోకి నొక్కేశాడు.

"నిజమేరా! నాకు కూడా ఓ ముల్లు గుచ్చుకుంది. తోటలో ఎన్నడూ ముల్లు కనపళ్లేదు కదా?"

"మనం పరిగెత్తి రాకుండా ఉంటామని ముళ్ల జిమ్ముకుంటూ పోయారేమో మామయ్యా!"

"ఓ దొంగ వెధవలకి తెలివితేటలేం తక్కువ?" ఎంత వెదికినా ఆ రోజు ఆనమాలన్నది దొరకలేదు — టమాటాలు కోసి పోసి రోజు— చేమంతులు మాయమైన రోజు— మరో రోజు—మరో రోజు—మధు మాత్రం అందరి ఎదటా చావిట్లోనే నిద్రపోయాడు.

ఇక దొంగతనాలు ఆగి పోతాయనుకొన్న రోజే దొంగతనం జరగటం— దొంగలు పట్టుబడకుండా కామరూపుల్లా మాయమవటం ఐదారుసార్లు జరిగింది— విశ్వనాథం ప్రయత్నాలేమీ చెల్లలేదు —చివరికి ఎవణ్ణయినా చూసి తోటకి తెల్లవార్లూ కాపలా పెట్టటం ఒక్కటే మార్గమనుకున్నాడు.

పంచాయతీ ఎన్నికలు దగ్గరికి రావటంతో ఇంటి వ్యవహారాలు అంతగా పట్టించుకోటానికి వీలు గాకుండా పోయింది. విశ్వనాథం ప్రసిడెంటుగా నిలబడాలని కోరికతో వున్నాడు. తనకు ప్రత్యర్థిగా నిలబడబోతూన్న నారాయణరాజుని చిత్తుగా వోడించి పారెయ్యాలని కుతూహల పడుతున్నాడు. ఎన్నికల కబుర్లు రహస్యంగా రామ్మూర్తితో గుస గుస లాడుతూన్న విశ్వనాథానికి పోస్టు బంట్రోతు ఒక ఉత్తరం ఇచ్చి వెళ్లి పోయాడు— అది సెలవులకు ఇంటికి వెళ్లిన మదనగోపాలం మధుకి రాసిన ఉత్తరం. రామ్మూర్తి వెళ్లాక విశ్వనాథం నిస్సంకోశంగా కవరు చించేసి చదవటాని కుపక్రమించాడు. ఊసరివెల్లి రంగుల్లా విశ్వనాథం మొహంలో రంగులు మారి చివరికి కోపం తారాస్థాయిన నిలిచి పోయింది. ఉగ్రుడై లేచి నిలబడ్డాడు— "ఒరేయ్! మధూ!" దాదాపు గర్జించాడు.

"లేడు. ఎక్కడికో వెళ్లినట్టున్నాడు. ఎందుకు?" సుందరమ్మగారు జవాబు చెప్పింది.

"ఎందుకేమిటి? ఎక్కడ చచ్చాడు?"

"మళ్ళా ఏమొచ్చి పడింది?" విసుక్కుందావిడ.

అంతలోనే మధు ఖర్మ తోసుకు వచ్చినట్టు పరిగెత్తుకు వచ్చాడు— "అమ్మమ్మా! గోపీ ఊరెళ్తున్నాడే! వాడూ నేనూ పెన్సిళ్లు మార్చుకున్నాం."

# కూలిన గోడలు

విశ్వనాథం భూనకం మనిషిలా మధుమీద విరుచుకు పడ్డాడు. జుట్టు వంగదీసి బాదటం మొదలు పెట్టాడు— "దొంగ వెధవా ! గతిలేని వాడివని ఇంట్లో చేరదీస్తే ఇదా నువ్వు చూపించే మంచి తనం ? మాట్లాడవేం ?"

"ఏమైంది ? అసలేమైందిరా ? ఎందుకు వాడినలా గొడ్డుని బాదినట్టు బాదుతావ్ ?" సంగతేమిటో చెప్పమని దేవుళ్లాడుతూ సుందరమ్మగారు అడ్డు వెళ్ళబోతే గెంటి పారేశాడు.

"నేను చెప్పటం కాదు. నీ మనవడితోనే చెప్పిస్తాను. చెప్పవేంరా ? తోట దొంగతనాలన్నీ ఎవరు చేశారు ? మాట్లాడు." గర్జించాడు.

"అదేమిటి ? వాడికెలా తెలుస్తుంది ?"

"నువ్వు నోరు మూసుకో. వీడికి కాకపోతే ఇంకెవడికి తెలుస్తుంది ? రౌడీ వెధవా ! ఇంత తెగించావేం ? సిగ్గు లేదుట్రా ?"

మధు దడదడలాడే గుండెలతో నిలబడి పోయాడు. గల్లంతుకి ఇంట్లో వాళ్లంతా చావిట్లో మూగారు.

"ఇంటి దొంగని ఈశ్వరుడు పట్టగలడా ? ఈ దొంగ వెధవ నాయకత్వం వహించి మరీ చేయించాడన్నమాట. "మళ్లా ఒక చెంప పెట్టు పెట్టాడు విశ్వనాథం. మధు తూలిపడి లేచి నిలబడ్డాడు.

"ఆ సంగతి మీకెవరు చెప్పారూ ?" సాగ దీసుకొంటూ అడిగింది పార్వతి.

విశ్వనాథం ఉత్తరం గిరవాటు పెట్టాడు. "ఇదిగో. చదువుకోండి. ఆ వెధవ ఈ వెధవకి రాశాడు. ఇక్కడి గమ్మత్తులన్నీ చెప్పుకు నవ్వుకున్నారట. ఈ రౌడీ వెధవ తెలివితేటలకు వాళ్లంతా మురిసి పోయారట. అడ్డమైన వెధవల్నీ జేరిస్తే ఇలాగే ఉంటుంది— ఏంరా ? అసలు నీకింత సాహసం ఎలా వచ్చిందిరా ?" విశ్వనాథం మధుచొక్కా పట్టుకు గుంజి వెనక్కి తోశాడు. స్తంభం కొట్టుకున్న మధు— "అమ్మా !" అంటూ కింద పడి పోయాడు. తలమీద చిట్లి బొటబొటా నెత్తురు కారి చూస్తూండగానే చొక్కా తడిసిపోసాగింది. సుందరమ్మగారు గుండెలు బాదుకుంటూ మనవడి దగ్గరికి పరిగెత్తింది — మధు రక్తం కళ్లజూశాక విశ్వనాథం కాస్త శాంతించాడు.

"చావనివ్వండి, ఇలాంటి వెధవ ఉన్నాడంటే నాకు సిగ్గుచేటు." అంటూ గదిలోకి వెళ్లి పోయాడు.

సుందరమ్మగారు కళ్ళు తుడుచుకుంటూ మంచం వాల్చి పక్కవేసి మనవణ్ణి పడుకోబెట్టింది పిడికెడు ముగ్గు తెచ్చి వాడి నెత్తిమీద పోసి అదిమి పెట్టింది— మధు తెలివి తప్పిన వాడిలా పడు కుండిపోయాడు. సూర్యం రాగానే సుందరమ్మగారు ధర్మాసుపత్రికి పంపించింది.

కొత్తగా బదిలీ అయివచ్చిన డాక్టరు కేశవరావు సూర్యాన్ని వివరాలన్నీ అడిగి తెలుసుకున్నాడు— "నువ్వుట్రా ? ఎప్పుడో చిన్నప్పుడు చూశాను. సరే ! పద. నేను వస్తాను. తర్వాత మాట్లాడుకుందాం" — కాంపౌండర్‌ని తీసుకు బయల్దేరి వచ్చాడు. (సశేషం)



### జ రి గి న క థ

అదృష్టం వున్నా, ఆనందానికి నోచుకోని వృద్ధమూర్తి సుబ్బయ్య. బదిలీ అయిన వ్యవసాయ డెమాన్‌స్ట్రేటర్ రామారావుకు వాళ్ళయింట్లో గది అద్దెకు దొరుకుతుంది. విపరీత పరిస్థితుల్లో తారసపడిన ప్రసాద్‌ను దుర్గయ్య ఆదరిస్తాడు. అనుకోకుండా అతనికి విమల, కమలలతో పరిచయం పొతుంది. రామారావు గీసిన చిత్రాలను విమల మెచ్చుకొంటుంది. కమలను చూచిన ప్రసాద్ ఆమెమీదనే తన దృష్టిని లగ్నం చేస్తాడు. రామారావుకు హిందీ నేర్పటానికి సుబ్బయ్యగారు, విమలను వినియోగిస్తారు. కమల, ప్రసాద్‌లు సన్నిహితులవుతారు. కాని, ఆమాట విని, సుబ్బయ్యగారు మండిపడ్తారు—కమల మనస్సును మార్చటానికి ఆయన ప్రయత్నం ప్రారంభిస్తాడు.

## 9

సాయంకాలం నాలుగున్నర గంటలయ్యేసరికి ప్రసాద్‌కి తెలివి వచ్చింది. మధ్యాహ్నం భోంచేసి పన్నెండు గంటలకు దుర్గయ్య గదిలో నక్కమీద మేను వాల్చిన ప్రసాద్‌కు మంచి నిద్ర పట్టింది. రాత్రుల్లో పేకాట ఆడటం వల్ల నిద్ర లేక పోయినా పగలు వేరే పని పాటా లేకపోవడం వల్ల హాయిగా నిద్ర పోవడం అలవాటయింది. అయిదు గంటలకు కమలను కలుసుకోవలసిన అవసరమే లేక పోతే, ఇంకా అలా నిద్ర పోతూనే ఉండే వాడు. అదిగాక నిద్రలో ఒక బ్రహ్మాండమైన కల వచ్చింది.

ప్రేమికులకు కలలు రావడం సహజం. వీటిని మధురమైన కలలంటారు. జూలియట్‌ని ప్రేమించిన దగ్గర్నుండీ రోమియోకి ఇలాంటి తియ్యటి కలలెన్నో వచ్చి ఉంటాయి. ఈ కలల్లో సాధారణంగా, తాము ప్రేమించిన వ్యక్తి, తామూ కలిసి ఏదో ఒక అద్భుతమైన ప్రపంచంలో విహరిస్తున్నట్టు, పైకి విమానంలో ఎగిరి పోతున్నట్టు మబ్బులో తేలి పోతున్నట్టూ కన్పిస్తుంటాయి. ఒక్కొక్కప్పుడు, ఆ కలల్లోనే ఎవరో దుర్మార్గుడు తమను వెంటాడుతున్నట్టూ, తమ సౌఖ్యానికి భంగం కలిగించడానికి ప్రయత్నం చేస్తున్నట్టు కూడా కన్పిస్తుంది.

ప్రసాద్ కలలో కూడా అదే జరిగింది. అతనిని వెంటాడుతున్నది ఒక దుర్మార్గుడు కాదు, ముగ్గురు దుర్మార్గులు! ఒకడు మెడదగ్గర పొడుస్తున్నాడు, మరొకడు చేతిమీద, ఇంకొకడు చెవి దగ్గర, మరొకడు కాలివద్ద బల్లేలతో పొడుస్తున్నాడు. ఆ బాధ భరించలేక అతను "ఊ" అని మూలగసాగాడు. దుర్మార్గులమీద ప్రతీకారం తీర్చుకోవాలని ప్రక్కమీద ఇటూ అటూ కదులుతుండగా కల కరిగి పోయి, నిద్ర చెదిరిపోయి మెలుకువ వచ్చింది. తీరా పక్క మీద చూస్తే నాలుగు నల్లులు పాకి పోతున్నాయి. కలలో బాధించిన దుర్మార్గులు నల్లులన్న మాట!

తన శక్తంతా ఈ నల్లుల మీద చూపించి నలిపేశాడు! 'హు!' అనుకున్నాడు. "వెధవ నల్లులు"! అనుకుని మెల్లిగా లేచి టైం చూశాడు. నాలుగున్నర గంటలైంది. "అరె"! అనుకుని గబగబ మొహం కడుక్కొని, బట్టలు వేసుకో సాగాడు ఇంకా ఒకపావు గంట టైముందని అనుకొని, ఈల పాట పాడుకుంటూ తలదువ్వుకో సాగాడు. ఈల పాటయొక్క సౌలభ్యం ఎటువంటిదంటే, పాట రాకపోయినా ట్యూన్ అంటూ పాడుకోవచ్చు. ప్రసాద్‌కి మల్లీశ్వరి చిత్రం జ్ఞాపకమొచ్చింది. కృష్ణ శాస్త్రిగారి పుణ్యమా అని, ప్రేమికులకు పాడుకోవడానికి వీలుగా కొన్ని పాటలు రాసి పారేసారు. ఆ పాటలే లేకపోతే గుండె గొంతుకలో కొట్లాడుతుంటుంది గాని, నోటిలోంచి ముక్కలు పెగలడానికి వీలుండక పోను. 'మనసున మల్లెల మాలలూగెనే' అంటూ మొదలెట్టి 'గడియయేని ఇక విడిచి పోకుమా' అన్న ప్రార్థనతో చివరకు రావచ్చు. తన (భవిష్యత్) హృదయేశ్వరి, అందాల రాశి అవడమే కాకుండా వీనుల విందుగా పాడగల, గాన కోకిల అవడం, తన అదృష్టం అనుకున్నాడు. మాటల్తో అనలేని భావాలు పాటల్లో పాడుకోవచ్చు. తను ఆమెను వివాహమాడింతరువాత 'కవినై పోతానేమో!' అన్న సందేహం పట్టుకుంది. ఎందుకంటే ఆమె అందం మీద మామూలు మాటల్లో తన అభిప్రాయం చెప్పాలన్నా అదొక అద్భుత సౌందర్య వర్ణనగా మారి తీరుతుంది. అదే జనం కవిత్వం అంటారు. అసలొకక్కప్పుడు అంత అందమైన అమ్మాయి తనలో ఏం చూసి ప్రేమిస్తుందా? అని కూడ సందేహం కలుగుతూంటుంది. కాని దానికి జవాబు చెప్పలేం. 'ఆమె ప్రేమిస్తోంది' అని సంతోషించడమే ప్రస్తుత కర్తవ్యం.

అయిదు గంటలయ్యేటప్పటికి టంచనుగా ప్లాటుఫారం మీద పచారు చెయ్యడం మొదలెట్టాడు ప్రసాద్. దూరాన్నుంచి కమల రావడం చూశాడు. అతని మనసులో మల్లెల మాల లూగబోయాయి. కాని సుమారు వంద గజాల దూరంలో ఆమె ఉన్నా ఆమె ప్రక్కన మరొక మగ వ్యక్తి కూడా ఉండటం స్పష్టంగా కన్పిస్తోంది. ముందు, 'ఆఁ, ఎవరో వంచితుడు కాబోలు, వాడే పోతాడు లే" అని సరి పెట్టుకున్నాడు. కాని వాళ్ళు దగ్గరికి వస్తున్న కొద్దీ ఆ వ్యక్తి మరెవరో కాదనీ, ఆమె సోదరుడైన రవికుమార్ అని తెలుసుకున్నాడు.

దగ్గరికి వచ్చాక, రవికుమార్‌నే పలకరిద్దామా? అనిపించిందతనికి. కాని, ప్లాటుఫారం మీదికి వచ్చాక ప్రసాద్, వాళ్ళ ప్రవర్తనకు మరింత ఆశ్చర్యపోయాడు. కమల తలవంచుకు నడుస్తోంది. అసలు దృష్టి ఎక్కడుందో కూడా తెలుసుకోవడం కష్టంగా ఉంది. రవికుమార్ ప్రసాద్‌వైపు చూసిన చూపులో అసహ్యం, కోపం, చిరాకూ అన్నీ మిళితమైయున్నాయి. సరదాగా నవ్వుతూ అతన్ని పలకరించడానికి వెళ్ళిన ప్రసాద్, రవికుమార్ చూపుకు రక్తం గడ్డ కట్టేసిన వాడిలా అయిపోయాడు. ఒక ముష్టివాడు దగ్గరికి వస్తే వాడి వైపు ఎటువంటి చూపు చూస్తాడో అలాటి చూపే రవికుమార్ ప్రసాద్ వైపు ప్రయోగించాడు. వాళ్ళు సేషను దాటి పోయే లోగా, ప్రసాద్ మరొకసారి కమలవైపు చూశాడు. ఆమె, అసలు తనకీ ప్రపంచంతోనే సంబంధం లేనట్లు, ఎటువైపో దృష్టించుకొని నడుస్తోంది. వాళ్ళు స్టేషను దాటి ఊళ్ళోకి వెళ్ళాక, ప్రసాద్ నెమ్మదిగా అడుగులేసుకుంటూ ప్లాటుఫారం చివరకు వెళ్ళి పోయాడు.

అతనికి ముందు రవికుమార్ మీద కోపం వచ్చింది. ఈ రోజు సగం సంతోషాన్ని రవికుమార్ భగ్నం చేశాడు. తరువాత కమల తనవైపు ఒక్కసారైనా చూడకపోవడానికి కారణమేమిటి? .... ఏమిటి అని?... ప్రసాద్ సిగరెట్టు తీసి ముట్టించాడు. పొగ పీల్చాక బుర్ర పని చేసింది. అసలు తన అన్నగారికీ విషయం తెలియకూడదని ఆమె ఉద్దేశమేమో... ! రైట్! అదీ అసలు సంగతి! తను అనవసరంగా బాధ పడుతున్నాడు. మరో గంట పోయాక ఆమె ఈ విషయాన్ని చెబుతుందనుకున్నాడు.

ప్రతి రోజూ సాయంకాలం టైపు ఇన్‌స్టిట్యూట్ నుంచి తిరిగి వచ్చేటప్పుడు కమల, స్టేషనుకు కొంత దూరంలో ఉన్న కొండ గుట్టల వద్ద ప్రసాద్‌ని కలుసుకోవడం పరిపాటు. రోజూ ఆమె మామూలుగా ఆరుంపావయ్యే సరికల్లా వచ్చేసేది. కాని ఆ రోజు ఆరున్నరయినా ఆమె జాడ లేదు. ప్రసాద్ గుండెలు వేగంగా కొట్టుకోనారంభించాయి. కమల ఎందుచేత రాలేదు. చెప్మా? అని ఆలోచిస్తూ కొంత సేపు గడిపి మెల్లిగా స్టేషను వైపు నడిచాడు. అప్పటికప్పుడే ప్లాటుఫారం దిగి వెళ్ళి పోతున్న కమలా, రవికుమార్ కన్పించారు. ప్రసాద్ గబగబ నడిచి వాళ్ళ వెనకాల కొద్ది దూరం వెళ్ళాడు. కాని అతనికి అట్టే దూరం వెళ్ళక్కర లేకుండానే, ఆ రోజుకి రవికుమార్ వంటరిగా వదిలే ప్రయత్నంలో లేడనీ, ఇక తనూ కమలా ఆ నాటికి కలుసుకోలేరనీ తెలుసుకున్నాడు.

ప్రసాద్‌కి ఒక్కసారిగా ఎంతో నీరసం వచ్చింది. ఒక్కరోజు తాము కలుసుకోలేకపోవడం వల్ల ఎంత బాధగా ఉంటుందో తెలుసుకున్నాడు. ఆ రోజు జీవిత కాలంలో వృథా అనుకున్నాడు. ఇన్నాళ్ళూ రవికుమార్ అంటే ప్రసాద్‌కి ఎంతో మంచి అభిప్రాయం ఉండేది. కాని ఈ నాటితో అది పూర్తిగా తొలగి పోయింది. కమలను ఒక్క క్షణమైనా విడువకుండా వెన్నాడడంలో అతని ఉద్దేశమేమిటి? కమలను ఎవరైనా ఎత్తుకుని పోతారని భయమా? లేక అతను ప్రక్కనుండడం వల్ల కమల ఉల్లాసంతో గంతులేస్తుందనా? ఆమె రూపం చూసిన వారెవరైనా, ఆమె ఎంతో విచారంలో ఉందని గ్రహిస్తారు. ఆ విషయం రవికుమార్ గ్రహించలేకపోతే అతనికి మంద బుద్ధులలో మొదటి ప్రైజు ఇవ్వవచ్చు. ఇంతకీ ఎందుకు అతను వెన్నాడాలి, ఆమెను?

ఎందుకు? ఎందుకు? ఎందుకు? అని వరుసగా



మూడు రోజులు ప్రశ్నించుకున్నా, ఎందుకో ప్రసాద్‌కి తెలియలేదు.

రోజూ కమల ఒంటరిగా వస్తుందేమోనని గంపెడాసతో అయిదు గంటలకు ప్లాటుఫారం మీదకు రావడం, కమలా రవికుమార్ నడిచి వస్తూ ఉంటే చూడడం, వాళ్ళు స్టేషను వదిలి వెళ్ళి పోయే దాకా, రవి కుమార్ కొన్ని నిముషాలైనా కమలని ఒంటరిగా వదుల్తాడేమో అని ఆశ పడడం ఎందుకంటే ప్రసాద్ తను కమల కోసం వస్తున్న బాధంతా ఒక ప్రేమ లేఖలో రాశాడు. ఆ లేఖని ఎలాగైనా ఆమెకు అందజెయ్యడానికి వీలవుతుం దేమోనని—ఆశ నిరాశ కాగా, మళ్ళీ వాళ్ళు తిరిగి వచ్చేదాకా ఎదురు చూడడం, అప్పుడు కూడా రవి కుమార్ ఆమెతో వస్తూంటే, ఇక ఆ రోజుకు లాభంలేదని నిరాశ చెందడంతో ఈ మూడు రోజులూ గడిచాయి.

ఒక్కొక్కప్పుడు ప్రసాద్‌కి, రవికుమార్‌ని చూస్తూంటే, ఎద్దైనా లావుపాటి కర్రతో అతని నెత్తి మీద ఒక పెట్టు పెడ్దామా? అన్న ఆలోచన కలుగుతూండేది. వెనుక భీముడు, అజ్ఞాతవాస సమయంలో పాంచాలికి పరాభవం జరిగినప్పుడు కీచకుణ్ణి చూసి ఇటువంటి భావాలతోనే ఒక పెద్ద తాళ వృక్షాన్ని కదపటం మొదలెట్టాడుట. ఆ తరువాత ధర్మరాజు వారించడం వల్ల ఊరుకున్నాడట. దుర్గయ్యగారు బాధపడచ్చునని, ప్రసాద్ కూడా ఊరుకున్నాడు గాని, ఏ మాత్రం వీలున్నా ఒక దుడ్డు కర్రతో రవికుమార్‌ని బాదుండేవాడు.

తనకి ఇంత గొప్ప సన్మానం చేసే గ్రూహతో ప్రసాద్ బాధ పడుతున్నాడని తెలియని రవికుమార్ రోజూ ప్రసాద్‌ని ప్లాటుఫారం మీద చూస్తూ "వీడు నిజంగా రవుడీయే! లేకపోతే ఇంత సాహసం చేస్తాడా? పాపం కమల ఎంత మోసపోయింది! ఈ పాటికి తన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయని తెలుసుకుని ఊర్పూరునుంచి వుడాయించే ప్రయత్నం చేస్తూ వుండి ఉండాలి". అనుకోసాగాడు. తను వచ్చిన సమయంలో, ఈ రవుడీ చేతిలో పడకుండా కమలని రక్షించాననుకున్నాడు. అంతే కాకుండా పిల్లిద్దరి మధ్యా ఏమైనా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగి ఉంటే, వాటిని కూడా మాయం చేయాలి. కమలని ఈ విషయంలో సూటిగా అడిగి లాభం లేదు. ఎందుకంటే తండ్రి ఈ విషయం తెలుసుకుని కేకలేసిన దగ్గర్నుంచి ఆమె ఇంట్లో ఎవరితోనూ సరిగ్గా మాట్లాడటం లేదు. ఇంట్లో అంతా తనకు శత్రువులేనని ఆమె గ్రహించింది. రవికుమార్ ప్రమాదవశాత్తూ ప్రసాద్ విషయం ఏమైనా అన్నాడో, తనకొక గుక్కెడు విషం తెచ్చి పెట్టే హాయిగా త్రాగి మరణిస్తానంటుంది. అందువల్ల రవికుమార్ రహస్య పద్ధతుల ద్వారా తనకు కావలసిన విషయాలన్నీ సేకరించ దల్చాడు. మేడ మీద ఉన్న గదులలో ఒకటి విశేషంగా కమల వాడుతూంటుంది. అందులోనే ఆమె బీరువా, బట్టల పెట్టె, పుస్తకాల అల్మారు ఉన్నాయి. కమల లేని సమయంలో అవన్నీ ఒకసారి తనిఖీ చెయ్యడానికి నిశ్చయించాడు.

## 10

"రెండు కోస్తులమీద కుదేలు, కురిసు సాయునా డబ్బు" అన్నాడు బుచ్చి శాస్త్రి, ప్రసాద్‌ని. తన

హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ:

# నాకు అసలే ఏలినాటి శని, పైగా అష్టమ రాసిలో గురువు

ఇంకా నా పనులు సవ్యంగా ఎలా అవుతాయి!

"ఊరుకోరా, ఎప్పుడూ ఏవో గ్రహాలూ, రాసులూ అనే గోలతప్ప నీకు. నీ బాధంతకు కారణమునకు నీ జాతకము చూడనక్కరలేదు!" అంది అత్తయ్య.



"ఏమిటి అంటున్నావ్?" అన్నాను నేను. దానికి ఆమె ఇలా అంది. "అవును మరి, నువ్వేమో అలిసిపోయి, నీరసముగా కనపడుతున్నావు. ఎన్నో నెలలనుండి చూస్తున్నాను. ఇంట్లో అందరి మీదా చిరచిరలాడడమే కాని ఎందుకైనా పనికివస్తున్నావా?" "ఓహో! అంతేనా, ఇంకేమైనా ఉందా నాకు?" అన్నాను. "ఏమో బాబూ, నన్ను అడిగితే నువ్వు వెళ్ళవలసినది సిద్ధాంతి దగ్గరకు కాదు. డాక్టరు దగ్గరకు వెడితే మంచిది" అంది.



"ఊరుకో తల్లీ, ఎప్పుడూ డాక్టర్లూ, మందులూ అనే గోలతప్ప నీకు." అన్నాను. ఆవిడ పట్టుపడితే బల్లాకములా వదలదు. చివరకు నేను డాక్టరు దగ్గరకు వెళ్ళక తప్పలేదు. డాక్టరు నన్ను పరీక్షచేసి ఇలా అన్నారు. "మీ ఒంట్లో ఏమీ లేదు. మీరు నీరసముగా, అలసటగా ఉన్నట్లు ఉండటము తగినంత పోషణ లేదనడానికి చిహ్నము. మీరు రోజూ హార్లిక్స్ త్రాగండి."



అయినా. బలహీనముగా ఉన్నవారు హార్లిక్స్ త్రాగడము నాకు తెలిసినదే. నేను ఆరోగ్యముగా ఉన్నాను కనుక నాకు హార్లిక్స్ ఎందుకు అనుకొని ఒకనాడు నేను ఎరుగున్న సిద్ధాంతితో ఆ సంగతే అన్నాను. ఆయన "డాక్టర్లు చెప్పినట్లు చేయడమే మంచిది." అన్నారు.



అందువలన, ఒక మంచి రోజు చూసుకొని మరీ హార్లిక్స్ త్రాగడము ప్రారంభించేను. నాకు క్రమంగా శక్తి ఉత్సాహములు చేకూరేయి. ఇంట్లో అత్తయ్యా వాళ్ళు సంతోషించేరు. నా గ్రహస్థితి బాగుండనట్టే డాక్టరు నాకు హార్లిక్స్ సిఫార్సుచేసేరని సంతోషించేను.




# హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

(PAT.HL.4622)

## మనసున మల్లెలు

జేబులోంచి డబ్బు మెల్లిగా తీసి వరుసగా దుర్గయ్యకీ, నాగలింగానికీ, వామనమూర్తికీ, బుచ్చి శాస్త్రికీ, గిరిబాబుకీ, పంచాడు ప్రసాద్. అతనప్పటికే నాలుగుసార్లు కుదేలు పెట్టాడు.

కమలని కలుసుకోడానికి వీల్లేకుండా ఆమెవెంట రవికుమార్ రావడం ప్రారంభించి అప్పుడే అయిదు రోజులైంది. అయిదో రోజు రాత్రిస్నేహితులతో పేకాట ఆడుతూంటే ప్రసాద్ మనసు బొత్తిగా సరియైన స్థితిలో లేదు. అందువల్ల పేకాటలో తన దగ్గరున్న కాస్త డబ్బూ పోగొట్టుకుంటున్నాడు.

"కాస్సేపు నువ్వు ఆడకు తమ్ముడు, నీ చెయ్యి బాగులేదు" అని దుర్గయ్య ప్రసాద్‌ని వారించి ప్రక్క కూచో పెట్టాడు. దుర్గయ్య భారీ శరీరానికి వెనకాలజేరి ప్రసాద్ మెల్లిగా సిగరెట్టు కాల్చనారంభించినాడు.

"ఇది బొత్తిగా అధునిక యుగమైపోయిందోయ్. అసలు ప్రేమించడానికి కావలసిన హంగూ లేవీ లేవు. ఇదే గనక పురాణ కాకాలమో, కావ్య ప్రబంధ కాలమో అయినట్లయితే ప్రేమికులు ప్రేమికులు తమ ప్రేమను తెలియబర్చుకోడానికి ఎన్ని సౌకర్యాలుండేవి! ప్చ్..." అని వామనమూర్తి తనకు పంచబడ్డ ముక్కలు తీసుకుని పేర్చుకుంటూంటే, గిరిబాబు, "ఏమిటండీ ఆ సౌకర్యాలు?" అని అడిగాడు, ఆత్రుతతో.

"ఆ రోజుల్లో," అని మొదలెట్టాడు వామనమూర్తి, "దమయంతీ నలుల మధ్య హంస సందేశం నడిచింది. దుష్యంతుడు, శకుంతలని ప్రేమించినప్పుడు ఆమె చెలికత్తెలు వాళ్లిద్దరికీ రాయబారం నడిపారు. ఆఖరికి శాపగ్రస్థుడైన యక్షుడు, తన ప్రియురాలికి మేఘం ద్వారా సందేశం పంపించాడు. రాయబారం నడిపించే మధ్యవర్తులలోనే గొప్పతనం ఉంటుంది. ఈ రోజుల్లో ఆ సందేశాలేవీ? ఆ ప్రేమలేవీ?"

"ఆ సందేశాలు లేక పోవచ్చుగానీ, ఆ ప్రేమలు లేకపోలేదు. ఉదాహరణకి మన తమ్ముడినే చూడండి ఎంత గాఢంగా సుబ్బయ్యగారి అమ్మాయిని ప్రేమించాడో! నాలుగురోజుల్నుంచీ తిండి సరిగ్గా తినటం లేదు. మనిషి బొత్తిగా మనలోకంలో లేడు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉంటాడు. మళ్లీ ఆ అమ్మాయిని కలిసి మాట్లాడేదాకా, మనిషి మనవాడు కాడేమో? అన్న భయం వేస్తోంది" అన్నాడు నాగలింగం.

"అదేనండీ విరహావస్థ! దీన్నే ప్రబంధాల్లో గొప్పగా వర్ణించారు. ఆ మాటకొస్తే, ఒకప్పుడు నేను కూడా ఇలా బాధ పడిన వాణ్ణే."

"ఏమిటీ? మీరు కూడానా? వినగుతూహలం బయ్యోడు కలవిండు." అన్నాడు బుచ్చి శాస్త్రి, వామనమూర్తిని.

"అది స్వంత విషయం." అని వామనమూర్తి తప్పించుకోబోతూంటే, దుర్గయ్య, "చెప్పండి కవిగారూ ఏదో నలుగుర్లూ, మీరూ ఆ క్రిస్టియన్ పంతులమ్మా, గ్రంథం నడిపించేరని వినడమే కాని..."

"కటకటా! ఎంత దురన్యాయం! ఇద్దరి పవిత్ర ప్రేమికుల హృదయ వేదనను అర్థం చేసుకోకుండా ఇంత తేలికగా దానిని భావించే లోకం..."

"అది సరేనయ్యా అసలు జరిగిందేమిటో చెప్పు" అన్నాడు దుర్గయ్య.

"హు! చెప్తాను వినండి." అని బరువుగా నిట్టూర్చి ప్రారంభించాడు వామనమూర్తి. "అవి నేను క్రొత్తగా ఉద్యోగంలో చేరిన రోజులు నాకు ఇరవై రెండేళ్లుంటాయి. ఆ రోజుల్లో, రోజ్ అనే ఒక యువతి మా స్కూలులో టీచరుగా వచ్చింది. ఆమె సౌందర్యం చాలా ఆకర్షణీయమైంది. మేమిద్దరం ఏ ముహూర్తంలో చూచుకున్నామో గాని, మా మనసులు కలిసి పోయాయి. మా ప్రేమ దిన ప్రవర్ధమానం కాసాగింది. ఇంతలో ఈ సంగతి మా నాన్న చెవిలో ఎవరో ఊదేశారు. ఆయన చాలా గడుసు వాడు. ఒకవైపు నాకు పెళ్లి ఏర్పాట్లు చేస్తూ, మరొకవైపు అధికార్లను పట్టుకొని రోజ్‌కి ఆవూరికి పదిమైళ్ల దూరంలో ఉన్న మరొక స్కూలుకి బదిలీ చేయించాడు. అంతే కాకుండా అక్కడ హెడ్మాస్టరుకి మా విషయం తెలియజేసి, ఆమెను జాగ్రత్తగా చూసుకోమని చెప్పి హెచ్చరించాడు. ఆయన గడుసుగా సాయంకాలాలపూట ఆమెకు పంచాయతీ బోర్డు ప్రెసిడెంటు పిల్లల ట్యూషన్ తగిలించి, ఆమె ఎక్కడికీ కదలకుండా చూస్తుండేవాడు. ఎలాగో ఆదివారాల్లో మాత్రం పూరి బయట కల్సుకుంటూండే వాళ్లం. ఆ రోజులలో నేను పడ్డ బాధ ఇంతా అంతా కాదు. రెండు నెలలు గడిచాక నా పెళ్లి జరగడం, ఆమె ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి వెళ్లి పోవడం ఒకేసారి జరిగాయి." అని ఆగాడు.

"మొత్తానికి భగ్న ప్రేమ అన్న మాట." అన్నాడు నాగలింగం.

వామనమూర్తి ఎక్కడో చూస్తూ, "ఆరోజుల్లోనే నేను పద్యాలు రాయటం మొదలెట్టాను. నా ప్రథమ కవిత, రోజ్ వర్ణనతో ప్రారంభమైంది"

"కవిత్వానికీ ప్రేమకీ సంబంధం ఉందంటారు. నిజమే నన్న మాట." అన్నాడు బుచ్చి శాస్త్రి.

"ఆ మాటకొస్తే, నటనకూ, ప్రేమకూ కూడ సంబంధం ఉంది. నా స్వానుభవం వల్ల ఈ విషయం తెలుసుకున్నాను." అన్నాడు గిరిబాబు.

"తమరు కూడా ప్రేమించారేమిటీ?" అని అడిగాడు దుర్గయ్య.

"నా ప్రేమ అందరి ప్రేమలాంటిది కాదు. అందులో స్వార్థం లేదు. నేను ప్రేమించిన యువతికి, మరొకరితో వివాహం అయిపోతోంటే, కన్నీటితో ఆశీర్వదించాను. హృదయంలోని జ్వాలనణచుకొని, పైకి చిరు నవ్వు నవ్వాను. మనసులోని నరకాన్ని, బాహ్యానికి తెలియకుండా అనుభవించాను."

"అయితే మీది కూడా భగ్న ప్రేమ అన్నమాట" దుర్గయ్య విచారంగా అన్నాడు.

ఇది విని "హు"! అని ప్రసాద్ మూలిగాడు. బుచ్చి శాస్త్రీ నాగలింగం అతని బాధ గమనించారు. ఇది భగ్నప్రేమల గురించి మాట్లాడ వలసిన సమయం కాదన్నారు. దుర్గయ్య అవునన్నాడు. ఇహ భగ్న ప్రేమ గురించి మాట్లాడ కుండా, రెండు ఆటలు చకచకా కానియ్యమన్నాడు. మరో రెండు ఆటలయ్యాక, దుర్గయ్య, "అసలిప్పుడు మనం

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 19-6-64 సంచికలో ప్రచురించిన 'జీవనలత' కథారచయిత్రి 'రత్న ప్రభ' గారిని, తమ పూర్తి చిరునామా తెలియ చేయవలసిందని కోరుతున్నాం. —సం.



# మనసైన మల్లెలు

చర్చించ వలసింది, తమ్ముడి ప్రేమ ఎలా సఫలమవుతుందా? అని. దానికి మీ మీ సలహాలేమిటో చెప్పండి''

''అదండీ అసలు విషయం.. దుర్గయ్యగారు చెప్పినట్లు మనమంతా మనకు తోచిన సలహా లిచ్చి మనవాడు ఆ మూడు ముళ్ళూ వేసేసి . . .''

''మీ దక్షిణ మీకివ్వాలంటారు. ఉండవయ్యా మహానుభావా, అసలు మనవాడు విరహావస్థలోఉంటే పెళ్ళికంతా సిద్ధమైనట్లు మాట్లాడతావేమిటి. ఎంత సేపూ పౌరోహిత్యం చేద్దామనేవా నీ ధ్యాస?'' అన్నాడు వామన మూర్తి.

''లేకపోతే విరహం! విరహం! అంటూ కూర్చోమంటావా? నన్నడిగితే, అర్ధరాత్రి పూట ఆ అమ్మాయినెత్తుకు వచ్చి, చిటికెలో మెళ్ళోమంగళ సూత్రం కట్టెయ్యమంటాను. ఇలా మీన మేషాలు లెక్కిస్తే లాభం లేదు.''

''అదెలా కుదురుతుందోయ్, ఆ అమ్మాయి తండ్రి సామాన్యుడు కాదు''

''ఎందుకు కుదరదూ? అమ్మాయి ఇష్టపడితే సరి''

''అలా దారికి రా,'' అన్నాడు వామన మూర్తి అమ్మాయి ఒప్పుకుంటే తక్కిన విషయాలన్నీ తను జూసుకుంటానన్నాడు దుర్గయ్య. తక్కిన వాళ్ళంతా కూడా అమ్మాయిని ఒప్పించి, రహస్యంగా బయటికి పిలిపించి వివాహం జరిపించేస్తే, సుబ్బయ్యగారేమీ చెయ్యలేరన్నారు.

అంతవరకూ వాళ్ళ సంభాషణ గురించిఏమీ పట్టించుకోకుండా, సిగరెట్టు కాల్చుకుంటూ ఏదో ఆలోచిస్తున్న ప్రసాద్ అప్పుడు వాళ్ళ వైపు తిరిగి ''మొదట ఇష్టపడ్డట్లే కనిపించింది.తండ్రితో తానే మాట్లాడి, అసలు విషయం తేల్చేస్తానంది. కాని హఠాత్తుగా ఈ రవికుమార్ అన్నిటి వెంటాడటం మొదలెట్టిన దగ్గర్నుంచీ ఆమె ఉద్దేశమేమిటో తెలుసుకునే అవకాశం దొరకటం లేదు'' అన్నాడు. అందరూ నిజమేనని ఒప్పుకున్నారు.

అయితే ఇప్పుడు జరుగవలసిన కార్యమల్లా ఆమెతోటి మాట్లాడి, ఆమె తండ్రి కిష్టం ఉన్నా లేకపోయినా, వివాహానికిష్టపడేట్లయితే తగిన ఏర్పాట్లు చెయ్యడం అన్న మాట.'' అన్నాడు బుచ్చి శాస్త్రి.

''ఆ మాట్లాడటానికే అవకాశం దొరకకుండా ఉంది.''

''పైగా ఆ అమ్మాయి ఒంటరిగా ఉన్నప్పుడు మాట్లాడాలి.'' అన్నాడు వామన మూర్తి. ప్రసాద్ ఆమె ఒంటరిగా ఎప్పుడుంటుందా? అని ఆలోచించాడు. బయటకు ఎప్పుడు వచ్చినా ఆమెతో రవి కుమార్ ఉంటున్నాడు. అందుకని ఇంట్లో ఆమెకు వేరే గది ఉండి ఒంటరిగా ఉంటే?

''నేనొక కప్పు టీ త్రాగి వస్తాను'' అని బుచ్చి శాస్త్రి లేచాడు. ప్రసాద్ తను కూడా టీ త్రాగాలని ఆయనతో కలిసి హోటల్లోకి వెళ్ళాడు.

ఇద్దరూ గది బయటకు వచ్చాక బుచ్చి శాస్త్రి ''నీతో ఒక విషయం చెప్పా లనుకుంటున్నాను, అలా పద.'' అని ప్రసాద్‌ని ప్లాటుఫారం మీదకు కొంచెం దూరంగా తీసికెళ్ళాడు. అక్కడ, ''నేను ఇవాళ సుబ్బయ్య గారింట్లో వ్రతం చేయించవానికి వెళ్ళాను. పూజ చేయిస్తూంటే, ప్రక్క గదిలో సుబ్బయ్య గారూ, ఆయన కొడుకూ మాట్లాడుకుంటున్న మాటలు వినిపించాయి. ఆ మాటల్నిబట్టి నేను గ్రహించిన దేమిటంటే, ఎవరో నీమీద కిట్టని వాళ్ళు, ఒక ఆకాశ రామన్న ఉత్తరం సుబ్బయ్య గారికి రాశారుట. నీమీద చాలా చెడ్డగా రాసినట్లున్నారు. అందుకని కమల నిన్ను కలుసుకోకుండా కట్టడి చేస్తున్నారు'' అని చెప్పాడు.

''ఆఁ!'' అని ప్రసాద్ నిర్ఘాంత పోయాడు. ''ఆ ఉత్తరం ఎవరు రాసుంటారు?'' అని అడిగాడు.

''నా కొకరిద్దరు వ్యక్తుల మీద అనుమానం ఉంది. రాసిన వాడు మనలో తిరుగుతున్నవాడే గాని పై వాడు కాదు. ఆ విషయం తరువాత కనుక్కుందాం మరొక ముఖ్య విషయమేమిటంటే, కమలకు పెళ్ళి సంబంధం నిశ్చయమైంది. మద్రాసులో ఎవరో పెద్ద వ్యాపారస్థుల అబ్బాయిట. అందుకని నువ్వు వీలైనంత త్వరగా ఆమెను కలుసుకోవాలి''

''మీరు చెప్పింది నిజమే. కాని ఆమెనెలా కలుసుకోవడమో బోధ పడటం లేదు.'' అన్నాడు ప్రసాద్ నిరుత్సాహంగా.

''ఆమె సాధారణంగా మేడ మీద గదులలో మెట్లకు దగ్గరగాఉన్న చిన్న గదిలో నిద్రిస్తుంది. పూర్వం పాగదిలో ఆమె తల్లి కూడా నిద్రించేది గాని, ఆమెకు దీర్ఘవ్యాధి వచ్చాక క్రిందనే నిద్రిస్తుంట. ఆమెకు సాయంగా విమలకూడా క్రిందనే నిద్రిస్తుంది. సుబ్బయ్య గారు క్రిందనే పడుకొంటారు. ఎటొచ్చీ రవికుమార్ ప్రక్క గదిలో పడుకుంటాడు. రేపు రవికుమార్ విశాఖ పట్నం వెళ్ళి ఎల్లుండి తిరిగి వస్తాడు కాబట్టి రేపు రాత్రి సుమారు పదిన్నర గంటల తరువాత నువ్వు, ఆమె గదిలోకి వెళ్ళావంటే ఆమెతో తీరికగా అన్ని విషయాలూ మాట్లాడవచ్చు.'' అని బుచ్చి శాస్త్రి, ప్రసాద్‌కు అతను చెయ్యవలసిన కార్యక్రమం బోధించాడు. ప్రసాద్ అంతా శ్రద్ధగా విన్నాడు కాని అతనికి ఒక ముఖ్యమైన సందేహం కలిగింది.

''అసలు మేడ మీదకు వెళ్ళడం ఎలాగ?''

బుచ్చి శాస్త్రికి తను అసలు విషయం చెప్పడం మర్చి పోయానని జ్ఞాపకమొచ్చింది. ''నువ్వు చెయ్య వలసిందల్లా ప్రహరీ గోడ ఎక్కి, లోపలికి దూకడమేను. లోపల మెట్ల దగ్గర ఎవరూ ఉండరు.''

''బావుంది. ప్రహరీ గోడ ఎక్కడం సాధ్యమవుతుందా?''

తను ఈ విషయం అంతగా ఆలోచించ లేదని శాస్త్రి ఒప్పుకున్నాడు. ప్రసాద్ ఎలాగో తంటాలు పడి సాధిస్తానన్నాడు. ఆ తరువాత, బుచ్చి శాస్త్రి ఈ విషయం తమ ఇద్దరి మధ్యనే ఉండాలని, తక్కిన వారెవరికీ తెలియనివ్వ కూడదని చెప్పాడు. అందుకు ప్రసాద్ ఒప్పుకున్నాడు. పైగా

రెండు
ముచ్చటైన
చీరలు
ఒకే

ఏ ప్రక్క పైకి కట్టినాసరే - అందంగా కన్పిస్తారు **బిన్నీవారి క్యాపెల్లా**

**తిరుగు మరుగు కట్టగల అచ్చమైన శిల్కు చీరలు**

తిరుగు మరుగు వేయగల అచ్చమైన శిల్కు చీర అతి శీఘ్రంగా మీ సొగసును రెట్టించుకోగల ఈ సొంపైన వైవిధ్యాన్ని మీరు అభిలషిస్తారు. ఇది వదా బిన్నీవారి అచ్చమైన శిల్కు చీరలలో లభిస్తుంది. మనోరంజకంగా రకరకాల రూపు ఛాయలలో తయారు చేయబడ్డాయి.

ది బెంగుళూరు ఉలెన్, కాటన్ & శిల్కు మిల్స్
కంపెనీ లిమిటెడ్. అగ్రహారం రోడ్డు, బెంగుళూరు-23
బిన్నీ & కంపెనీ లిమిటెడ్, మద్రాసు వారి అంగ సంస్థ.



# ఫిలిప్స్ ట్రాన్సిస్టరు రేడియోలు



ఫిలిప్స్ పోర్టబుల్ ట్రాన్సిస్టరు
రు. 415/—



ఫిలిప్స్ మేజరు ట్రాన్సిస్టరు
రు. 665/—



ఫిలిప్స్ మైనరు ట్రాన్సిస్టరు
రు. 415/—



ఫిలిప్స్ ఫిలెట్టినా ట్రాన్సిస్టరు
రు. 278/—

టాక్సులు అదనం

- నూతన పరిశోధనలతో తీర్చి దిద్దబడి మధుర సంగీతము నిచ్చు మనోహరమైన రేడియోలు
- పనితనమునకుగాని, మన్నికకు గాని సాటిలేనివి
- నేడే కొని ఆనందించండి

## విజయ అండ్ కో., గుంటూరు

బ్రాంచి: మాచెర్ల

సబ్ డీలర్సు:

| | | |
|---|---|---|
| శ్రీనివాస స్టోర్సు | — | తెనాలి |
| బి. హనుమంతరావు | — | ఒంగోలు |
| రాజేంద్ర రేడియో హౌస్ | — | నర్సారావుపేట |
| జయా అండ్ కో | — | పొన్నూరు |
| రేడియో సేల్సు అండ్ సర్వీసు | — | చీరాల |
| కె. సాంబశివరావు | — | రేపల్లె |

తనయెడ దరత అభిమానం చూపించినందుకు బుచ్చి శాస్త్రికి కృతజ్ఞత తెల్పుకున్నాడు. బుచ్చిశాస్త్రి తనకు కావలసిందల్లా తన స్నేహితులంతా సంతోషంగా ఉండడమే నన్నాడు. ఇద్దరూ మెల్లిగా హొటలుకి వెళ్లి టీ త్రాగి, మళ్లీ దుర్గయ్య గదిలోకి చేరుకున్నారు.

ఈ సారి ప్రసాద్ ఉత్సాహంతో ఆట వద్ద కూర్చొని గెలవనారంభించాడు. తెల్లవార్లూ జయాపజయాలు ఇటు, అటూ వూగుతూంటే సరదాగా పేకాటతో మిత్రులంతా కాలక్షేపం చేసారు. మొట్ట మొదట ఆట దగ్గర్నుంచి లేచింది దుర్గయ్య. నాలుగు గంటలకల్లా హొటలుకి వెళ్లి పోయాడు. తరువాత ఒక్కొక్కరే లేచారు.

ప్రొద్దున్నే కలకత్తా నుంచి వచ్చే బండి రామనగరం రైలు స్టేషనులోకి పొగలు క్రక్కుతూ వచ్చి 'ఇహ నా బాధ్యత తీరిపోయింది. మీరేం చేస్తారో అది చెయ్యండి' అన్నట్టు ఆగింది. అన్ని పెట్టెల తలుపులూ తెరచుకుని ప్రయాణీకులు దిగ సాగారు. వాళ్లకు ఎక్కే వాళ్లు కొందరు అడ్డొస్తున్నారు. ప్లాటుఫారం మీద ప్రయాణీకులు ఇటూ అటూ వేగంగా తిరుగుతున్నారు. ఒక టికెట్ కలెక్టరు, కాకి యూనిఫారంలో, దర్జాఎంతా ప్రక్కనున్న ఇద్దరి ప్రయాణీకుల మీద (టిక్కెట్లు లేనందుకు దబాయిస్తూ,) చూపిస్తూ మెల్లిగా దుర్గయ్య హొటలు వైపు దారి తీశాడు.

ఆ సమయంలో దుర్గయ్య హొటలు వద్ద బోలెడు మంది ప్రయాణీకులు గుంపులుగా ఉన్నారు. అందరికీ ఆ క్షణంలోనే టిఫిన్లు, కాఫీలు కావాలి. దుర్గయ్య మంచి వేగంతో కాఫీల్ని తయారు చేసి గబగబ అందిస్తున్నాడు. రామం, అప్పన్నా టిఫిన్ల జనానికి అందిస్తున్నారు. అది మంచి రద్దీగా ఉండే సమయం అయినా అదే నాలుగు డబ్బులొచ్చే సమయం. అయిదు నిముషాలలో మూడొంతుల టిఫిన్ ఆ హొటల్లోనిది ఖర్చయి పోయింది. టికెట్ కలెక్టర్ గారికి దుర్గయ్య మర్యాదగా కాఫీ ఇచ్చాడు. ఆయన కాఫీ త్రాగుతూ, ఆ ఎదురుగా ఉన్న సెకండు క్లాసు కంపార్టుమెంటులోకి పంపించు, అన్నారు దుర్గయ్యతో.

వెంటనే దుర్గయ్య రామానికి అసని పురమాయించాడు. రామం ఒక పళ్లెంలో నాలుగు కాఫీలూ నాలుగు ఇడ్లీ పొట్లాలూ కంపార్టుమెంటు వద్దకు తీసుకువెళ్ళి లోపలున్న రైల్వే ఆఫీసర్లకు ఇచ్చి, కాఫీ గ్లాసులకోసం పెట్టెదగ్గర నిలబడ్డాడు. అలా నిలబడి యధాలాపనగా ప్లాటుఫారమంతా ఒకసారి కలయజూసాడు. ఆతనికి కొద్ది గజాల దూరంలో ఆడవాళ్ళ కంపార్టుమెంటులోంచి ఒక పదహారేళ్ల స్త్రీ చేతిలో ఒక చిన్న సంచితో దిగింది. మనిషి సన్నగా, ఎర్రగా ఉంది. క్రేప్ సిల్కుచీరా, సిల్కు రవికె వేసుకుంది. ఆమెను ఆ దుస్తులలో రామం ఎప్పుడూ చూడకపోవడంవలన మొదట్లో గుర్తుపట్టకపోయినా, ఒక నిముషం లోపలే ఆమె ఎవరో గుర్తించాడు. "నళినీ!"—అని కేకేసి ఆమెవద్దకు వెళ్లాడు. ఎందుకంటే ఆ అమ్మాయి సుబ్బయ్యగారింట్లో పని చేస్తూండే పనిమనిషి నళిని. రామం యొక్క హృదయాన్ని ఆమె హరించిందని రామం ఇదివరకే అందరికీ తెలియజేసాడు. సుమారు రెండు నెలలనుండి ఎక్కడికో వెళ్ళిపోయిన నళిని

# మనసున మల్లెలు

మళ్లీ హఠాత్తుగా కన్పించింది. రామం తన ఉత్సాహం ఆపుకోలేకపోయాడు. "ఎక్కడికెళ్లావ్ నళినీ ఇన్నాళ్లు?" అని సంతోషంగా ప్రశ్నించాడు.

"ఎడకెల్తే నీకెందుకు?" అని కసురుకుంది నళిని. ఆమెకు రామంయొక్క రాకగాని, పల్కరింపుగాని ఎంతమాత్రం రుచించలేదు. అసలు రామం కన్పించగానే ఆమె తన ముఖం ఇంకొకవైపుకు తిప్పేసుకుంది. రామంయొక్క ప్రేమ ఆమె నెంతమాత్రం కదిల్చినట్లు లేదు.

"ఎన్నాళ్లకు కనిపించావ్ నళినీ! నువ్వు వెళ్లిందగ్గర్నుంచి నా మనసు మనసులోలేదు" అనేశాడు రామం, తనను నళిని కసురుకుందని కూడా లెక్కచెయ్యకుండా కొంత విచారాన్ని తన గొంతుకలో మిళితంచేసి.

"ఏటీ గొడవా!" అని మరికాస్త చిదరించుకుంది నళిని. ఇంతట్లో రైలు కుయ్యడం, కాఫీ త్రాగిన మనుషులు సెకండు క్లాసు కంపార్టుమెంటులోనుండి రామాన్ని పిలువగా కప్పులు తీసుకోవడానికి రామం అక్కడికి వెళ్లాడు. అతను వెళ్లగానే నళిని గబగబ నడుచుకుంటూ రెండోవైపుకు వెళ్ళిపోయింది. రైలు కూడా కదిలింది.

రామం తిరిగి వచ్చేసరికి నళిని ప్లాటుఫారం దిగి సుబ్బయ్యగారింటి వైపు వెళ్లింది. రైలు వెళ్ళిపోయాక రామం హొటలులోకి వెళ్లాడు. అతని మనసులో ఒకవైపు నళిని కన్పించిందనే ఉత్సాహం, మరొకవైపు ఆమె తన యెడల మునుపటి ఆప్యాయత చూపించలేదే అన్న బాధా కొంతసేపు పెనుగులాడాయి. చివరికి ఉత్సాహమే జయించింది. ఆమె ఏదో కారణంచేత తనకు సరిగా జవాబివ్వలేదుగాని, సాయంకాలంలోపల మళ్లీ కన్పించి దానికి సరియైన కారణం చెప్తుందని ఆశించాడు. అతనికి కొద్దిగా ఆశ్చర్యం కలిగించిన విషయం నళినియొక్క దుస్తులలో మార్పు. ఇంతకుముందెప్పుడూ ఆమె అంత మంచి దుస్తులు వేసుకోగా రామం చూడలేదు. కానీ నళినికి మొదటినుండీ మంచి మంచి దుస్తులు వేసుకోవాలనీ, సినిమా స్టార్‌లాగ ఉండాలనీ వ్యామోహం ఉంది. అందువల్ల ఎలాగో కష్టపడి సంపాదించి కొనుక్కుందేమో? ఏమైనా సిల్కు బట్టలలో ఆమె మరీ అందంగా కన్పించింది రామానికి. మళ్లీ ఆమె రావడం తన అదృష్టం అనుకున్నాడు.

భార్య: ఏమండీ, మిమ్మల్ని
ఇలా వీధివాకిట్లో కూర్చోవద్దని
ఎన్నిసార్లు చెప్పినా వినరేం?
భర్త: కూర్చుంటే ఏం?
భార్య: మా స్నేహితులెవ
రైనా చూస్తే నేను ఇంటిలో
కూర్చుని వంట చేస్తున్నా ననుకుంటారు...

కె. రంగారావ్

[illegible]

రామం వర్ణించి వర్ణించి చెప్పాడు. ప్రసాద్ ఒక గంట గడిచిన తరువాత కాఫీ త్రాగడానికి వచ్చినప్పుడు, "అసలు ముందు ఎవరో గొప్పోళ్ళమ్మాయనుకున్నాను సార్. మొహం ఇటు తిప్పింది. దాంతో పోల్చేసాను. దగ్గరికివెళ్ళి పలకరించాను సార్. మనిషి చాలా మారిపోయింది. మునుపు పరికిణీ, వోణీ వేసేది. ఇప్పుడు సిల్కు చీర కట్టింది సార్—సిల్కు చీర!" ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్న ప్రసాద్, "రామం, నళినితో నీకు మంచి పరిచయముందా?" అని అడిగాడు.

"ఓ!" అన్నాడు రామం. ఎలాటి పరిచయమో చెప్పమని ప్రసాద్ అడిగేసరికి, "రోజూ ప్రొద్దున్నే ఇడ్లీలుకొని సుబ్బయ్యగారింటికి పట్టుకెళ్లానికి వచ్చేది సార్. "నువ్వు సినిమా స్టారులా ఉన్నావంటే" పొంగిపోయేది సార్. అలా పరిచయమైంది. నన్ను పెళ్లిచేసుకుంటావా? అని అడిగానుసార్. మద్రాసు తీసికెళ్లి సినిమాల్లో వేష మిప్పిస్తే చేసుకుంటానంది. సరేనని మద్రాసు వెళ్లడానికి డబ్బు కూడబెట్టానుసార్. కాని అంతలో హఠాత్తుగా మాయమైందిసార్" అన్నాడు.

ప్రసాద్ మనసు పరిపరివిధాల పనిచెయ్య సాగింది. రాత్రి బుచ్చిశాస్త్రి చెప్పిన విషయాలు అతనికి చాలా ఆశ్చర్యం కలిగించాయి. తనమీద కిట్టనివా రెవరుంటారా? అని ఎంత ఆలోచించినా అతనికి ఏమీ స్ఫురించలేదు. ఒక్కొక్కప్పుడు తను తిన్నగా సుబ్బయ్యగారివద్దకే వెళ్దామా? అని ఆలోచించేవాడు. కాని కనుల వర్షనడం, తన గురించి చెడ్డగా ఎవరో సుబ్బయ్యగారికి రాయడం, ఆ ప్రయత్నంలో అతనికి అంత ప్రోత్సాహ మివ్వలేదు. కాఫీ త్రాగడం ముగించి హొటలునుండి బయటకు వచ్చాడు.

ప్లాటుఫారంమీద ఇటూ అటూ తిరగుతూ రాత్రి తను చెయ్యవలసిన కార్యక్రమం గురించి ఆలోచించాడు. అంతకుముందెప్పుడూ తను సుబ్బయ్యగారింటివైపు వెళ్లలేదు. అందువల్ల ఇంట్లోకి ఎలా వెళ్లాలో అతనికి తెలియదు. ముందుగా ఒకటి రెండుసార్లు చూడనిదే ఆ ఇంటి ఆనుపానులు తెలియవు. తను అటువైపు వెళ్దామంటే తనవేవరైనా చూసి 'ఇతను మన ఇంటివైపు ఎందుకు వచ్చాడా?' అని సుబ్బయ్యగారింట్లో వ్యక్తులు అనుమానపడ్తారేమో? అని భయం వేసింది.

ఆ సమయంలో "హల్లో!" అన్న కేక విన్పించి తిరిగి చూచేసరికి రామారావు కన్పించాడు. ఈమధ్య రామారావు, ప్రసాద్ రోజూ కలుసుకుంటూనే ఉన్నారు. ప్రసాద్‌ని తన గదికి రమ్మని అతను రోజూ అడుగుతూనేవున్నా, 'అలాగే' అంటూ ప్రసాద్ కాలం గడుపుతున్నాడు. ఇప్పుడు ప్రసాద్‌కి హఠాత్తుగా స్ఫురించింది—రామారావు గది సుబ్బయ్యగారింటి ప్రక్కనే అని. అతనితో కొద్దిసేపు మాట్లాడేసరికి, ఆరోజు అతని ఆఫీసుకు సెలవనీ, ఏమీ తోచటంలేదనీ, అతను అనడంవల్ల ప్రసాద్ అతనితో కలిసి, ఆయన రూముకి వెళ్లడానికి నిశ్చయించాడు. ఇద్దరూ మెల్లిగా మాట్లాడుకుంటూ ప్లాటుఫారం దిగి సాగిపోయారు.

(సశేషం)



'దాగుడు మూతలు'లో ఒక దృశ్యం.



'అగ్గిపిడుగు'లో ఎన్. టి. రామారావు, కృష్ణకుమారి.

# మద్రాస్ సినీమా వార్తలు

## అమరశిల్పి జక్కన్న శతదినోత్సవము

విక్రమ్ ప్రొడక్షన్సువారు నిర్మించిన "అమరశిల్పి జక్కన' (ఈస్ట్‌మన్ కలర్) చిత్రం మార్చి 27 న విశాలాంధ్రంతటా విడుదలయి విజయవంతంగా ప్రదర్శింపబడుతోంది. జూలై 3 వ తేదీనాటికి 100 రోజులు పూర్తి అవుతుంది. నాలుగు, అయిదు కేంద్రాలలో 100 రోజులు దిగ్విజయంగా ప్రదర్శింపబడుతున్నది.

## "బొబ్బిలి యుద్ధం"

అది మల్లమాదేవి మందిరం. రంగారాయుడు, మల్లమాదేవి ఏకాంతంగా ఉన్న సమయం. రంగారాయుని తమ్ముడు వెంగళరాయుని వివాహానికి సర్వ సన్నాహాలు చేకూర్చడానికి ముచ్చటించుకున్న సమయం.

"మీ సలహా చాలా బాగుంది. అన్ని లాంఛనాలు జరిగి తీరాల్సిందే. బనారసు పట్టు పీతాంబరాలతో బందరు కలంకారీ చీరలతో, పెళ్ళికి వచ్చే పిన్నలకూ పెద్దలకూ అన్ని ముచ్చట్లూ తీరాల్సిందే. ఇప్పుడే అన్ని ఏర్పాట్లు చేయిస్తాము."

"ఆగండి. అన్ని ఏర్పాట్లూ ఇదివరకే జరిగాయి."

"ఊ! ఇక మనమేం చేయాలి ?"

"కూర్చుని ఈ ఫలహారాలారగించాలి" అంటూ మల్లమదేవి రంగారాయుని నోటికి లడ్డూను అందించి ——

"పెండ్లికి ప్రత్యేకంగా చేయించాము. ఎలా వున్నాయి ?" అని అడుగుతుంది. రంగారాయుడు మాట్లాడకుండా లడ్డూను రుచి చూస్తుంటాడు.

"ఎలా వున్నాయో చెప్పరేం ?" మళ్లీ అడుగుతుంది.

"వీరోచిత వ్యాయామ వ్యాసంగంతో కరడుగట్టుకు పోయిన మా హృదయంలో ఏ మూలో మణిగి వున్న రసికత్వాన్ని రాణిగారు రెచ్చగొట్టిన నాటి మన తొలిరేయి గుర్తుకు వస్తోంది. దేవి —"

ఆ మాటలతో రంగారాయుడు, మల్లమ్మదేవి శోభనపునాటి పూర్వ స్మృతిలోకి వెళ్లారు.

గదిలో ఉంచిన తిను బండారాల ముందు కూర్చొని వుంటాడు రంగారాయుడు. వాటిని రెండు భాగాలుగా విభాగించి — సైన్య సమూహాలుగా భావిస్తూ

"ఊ! గజ, తురగ, పదాదులు .... పాపయ్య బావా ! తెలిసింది నీ ఎత్తు ! .... ఆ ! ధర్మయ్య బావా ! మీరు కుడిగా పోయి వారిని చుట్టుముట్టండి. — పాపయ్య బావగారూ ! ఇప్పుడేమంటారు ? ఈ దెబ్బతో మీ ఆట కట్టు."
రంగారాయుడు చదరంగపు ఎత్తు వేయబోగా అంతకు ముందు నుండి ఆయన కోసం నిరీక్షిస్తున్న మల్లమ్మ ఒక లడ్డూను ఆయన చేతికి అందిస్తుంది. రంగారాయుడు తను నిర్మించుకున్న వూహాలోకం నుండి తెప్పరిల్లి ——

"సాములు చేసినా కందని మా శరీరం చిగురుటాకువంటి మీ చేయి సోకగానే పరవశించింది,

యుద్ధ రంగంలో కూడా ఇటువంటి చేతులే అడ్డు తగిలితే —— ''

'' ప్రభువుల సహధర్మచారిణి నయే భాగ్యం నాకబ్బింది. నేను మీకెప్పుడూ తోడు నీడనే గాని, దేనికీ అడ్డురాను.''

'' మీ లావణ్యం చూస్తూ వుంటే లక్ష్మీసరస్వతు లేకమై రతీదేవి రూపం దాల్చినట్లుంది. ఏదీ — మీ తియ్యని కంఠంతో ఒక పాట వినిపించండి.'' మల్లమాదేవి పాట పాడుతుంది. ఆ స్థితిలో వున్న రంగారాయుణ్ణి, నలహారాన్ని గురించి అభిప్రాయం తెలుసుకునేందుకు మల్లమాదేవి పిలుస్తుంది.

'' ఏమండీ ....... ఏ లోకంలో వున్నారు ? ''

'' అబ్బే ......... ఏమీ లేదు.''

జడ పట్టీని ఆయన ముందుంచుతూ ——

'' ఈ జడ పట్టీ ఎలా వుందో చెప్పారు కాదు.''

'' చాలా బాగుంది. మా తమ్ములంగారికి సరిగ్గా సరిపోతుంది.''

'' ఇది మీ తమ్ములంగారికి వేస్తారా ? ''

జడ పట్టీని చూస్తాడు రంగారాయుడు.

'' హ్హాహ్హా ! .......... అబ్బే — .......''

'' ఇది పెళ్ళికూతురు సుభద్రమ్మారావులుంగారికి. — ''

'' ఓ హో! ''

'' బాగుందా ? ''

'' చాలా బాగుంది.''

'' ముంగాళ్ళ మీద పరుగెత్తే మా మరిదిగారికి ఈ సుభద్రా కల్యాణంతో కళ్ళెం పడుతుంది.''

'' అవునవును. ఈ తుంటరికి కొంటెపిల్లకు సరిపోతుంది.''

'' ఎవరు — సుభద్రా కొంటెపిల్ల ! — మంచి పిల్లండీ .............''

'' ఊ ! — ఎటొచ్చీ మా మగవాళ్ళమే తెలివి తక్కువ వాళ్ళం — అంటే — మీ ఆడవాళ్ళు తెలివి కలవాళ్ళు ................ ! ''

ఈ సన్నివేశం రిపబ్లిక్ ప్రొడక్షన్స్ వారి చారిత్రాత్మక చిత్రం '' బొబ్బిలి యుద్ధం '' లోనిది. ఈ సన్నివేశంలో రంగారాయుడుగా యన్. టి. రామారావు, మల్లమాదేవిగా భానుమతి పాల్గొన్నారు.

వీరుగాక ఇంకా ఈ చిత్రంలో పాపారాయుడుగా యస్. వి. రంగారావు, వెంగళరాయుడుగా — పి. సీతారాం, నర్సారాయుడుగా — ధూళిపాళ, ధర్మారాయుడుగా — బాలయ్య, విజయరామరాజుగా — రాజనాల, బుస్సీగా — ముక్కామల, కృష్ణమూర్తి, హైదర్‌జంగ్‌గా — యం. ఆర్. రాధా, దుబాసి లక్ష్మన్నగా — స్వర్గీయ పి. యస్. ఆర్, గుండాల అప్పన్నగా — స్వర్గీయ డా. రాజారావు, సుభద్రమ్మారావుగా — జమున, దాసి వెంకట లక్ష్మిగా — కుమారి సురభి బాలసరస్వతి, రాజనర్తకిగా— ఎల్. విజయలక్ష్మి నటించారు.

ఈ చిత్రానికి మాటలు — గబ్బిట వెంకటరావు, మాటలు పర్యవేక్షణ — సముద్రాల రాఘవాచార్య, పాటలు — శ్రీశ్రీ, సముద్రాల ( జూనియర్) , పి. నారాయణరెడ్డి, ఆరుద్ర, కొసరాజు, సంగీతం — యస్ రాజేశ్వరరావు, ఛాయ — కమల్‌ఘోష్, కళ — ఘోడగాంకర్, కూర్పు — కందస్వామి, స్టూడియో — విజయా — వాహినీ, కథ — స్క్రీన్ ప్లే — దర్శకత్వం — నిర్మాత — పి. సీతారాం.

## "బ భ్రు వా హ న"

అర్జునుడు, చిత్రాంగద మణిపురి ఉద్యానవనంలో కలుసుకుంటారు. ఒకరినొకరు తెలియదు. ఇద్దరూ ఘర్షణ పడతారు. మణిపురి మహారాజా విచిత్ర వాహనుడుకు చిత్రాంగద చెలికత్తె పరిగెత్తి వెళ్ళి రాకుమారిని ఉద్యానవనంలో ఎవరో అవమానించినట్లు తెలియజేస్తుంది. విచిత్ర మహారాజా తన వారితో మాట్లాడుతున్న సమయ మది.

'' చిక్కేవు — చిక్కేవు.''

'' తమరు ఆనాటి కానాడు పిల్లలై పోతున్నారు మహారాజా ! ''

'' ఏమి చేయను మహాసభావా ? వయసూ వైభోగమూ, ఆ మహారాణి గారితోనే పోయినాయి. ఈ ఇంటికి దీపం, మా వంశానికి ఆధారం, చిత్రాంగద ఒక్కతేనా ! ఆమెనే కొడుకనుకొని ముచ్చట తీర్చుకుంటున్నాను. ఆమెకు పెళ్ళి పేరంటమై, పిల్లలు కలిగే వరకూ ఈ పిల్లలతోనే కాలక్షేపం.''

'' అదెంత భాగ్యం ప్రభూ! కళ్యాణ ఘడియ తోసుకువస్తే అల్లుడు తానే వెతుక్కుంటూ తమ దర్శనానికి వస్తాడు ''

'' మహారాజా — మహారాజా ! ''

'' ఏం ! మల్లికా ? ఎందుకీ ఆవేశం ? ''

'' గడుసు పిల్ల ! ఎవరినో తారసిల్లితే తగిన పాఠం నేర్పుంటాడు. — తమ ముందా ఉక్రోషం వెళ్ళబోస్తుంది.''

'' వేళాపాళా ఎరుగని వేళాకోళం చాల్లెండి బావగారూ ! తారసిల్లితే మిట్టకూ తరతమా తెలుక్కుండా దురుసుగా మాట్లాడుతారా ! రాకుమారితో సరసాలాడ్డానికి సాహసిస్తాడా ? ''

'' ఆ — సరసమే ! ఎవరా సాహసి ? ''

'' ఎవరో పరదేశి ! కురు వీరుడట. ద్రోణాచార్యుల శిష్యుడట. రాజోద్యానంలో మేమూ — రాకుమారి ఆడుకుంటూ వుండగా తారసిల్లేడు. తమరు మామ కావాలట మహారాజా ! ''

'' ఆ ! — ఎంతమాట ! ఎంతమాట ! ''

'' ఆ సంగతి తేల్చ వలసిందే.''

'' తేలుస్తాం ! తేలుస్తాం ! పదండి. — మల్లికా! యువరాజా గారిని కూడా రమ్మను.''

( అందరూ వెళ్తారు. )

అది మణిపురి ఉద్యానవనం.

అర్జునుడు — విశారద — విచిత్ర వాహనుడు — బావ — మగ వేషంలో చిత్రాంగద, చెలికత్తెలు, సైనికులు వుంటారు.

''ఉంటే నువ్వుండు — నేను వెళ్ళిపోతాను'' అంటూ విశారద రెండడుగులు ముందుకు వేస్తాడు. మహారాజును చూసి '' అరుగో మహారాజగారు '' అంటూ వెనుకకు నడుస్తాడు.

'' మన కన్యలను అవమానించింది ఆ సాహసే మహారాజా ! ''

'' అలాగే ! ఇతడేనా ? ''

'' అభివందనం మహారాజా ! ''

'' బాగు బాగు ! మా పరోక్షంలో తిరస్కారం. సమక్షంలో నమస్కారమా ! చాటుగా మా సీమలో ప్రవేశించి తోటలో విశ్రమించి మా పిల్లలతో సరసాలాడుతావా ? మాతో బాంధవ్యానికి సర్వసాహసం చేస్తావా ? ''

'' సావధానంగా విని సత్కరించండి ! ''

'' అంతా వినే చెబుతున్నాం ! నీవా మాకు హెచ్చరిక చేసేది. నీవు ద్రోణాచార్యుని శిష్యుడివేనా ? కురు వీరుడువేనా ? చెప్పు ! చెప్పు ! ''

అర్జునుడు విచిత్ర వాహనుని మాటలకునవ్వుతూ విశారద వంక తిరుగుతాడు.

''ముమ్మాటికీ నిజమే మహారాజా ! ద్రుపదుని బంధించి తెచ్చి గురు దక్షిణ చెల్లించిన దోర్బలశాలి. మత్స్యయంత్రం భేదించి ద్రౌపదిని చెట్ట బట్టిన వీరాధి వీరుడు. ఈ అర్జునుడే మహారాజా ! ''

'' ఆ ! — నీవు అర్జునుడువా ? ''

'' మా యువరాజు '' విచిత్ర వాహనుడు మగ వేషంలో ఉన్న చిత్రాంగదను అర్జునునకు పరిచయం చేశాడు.



బొంబాయిలో జరిగిన నాట్యావధాన ప్రదర్శనకు పృచ్ఛకునిగా హాజరయిన శ్రీ హరీంద్రనాథ చటోపాధ్యాయ, శ్రీ ధారా రామనాథశాస్త్రిని అభినందిస్తున్న చిత్రం.

# సినిమా వార్తలు

"ఓ"

"మేము మహారాజులం కామా? మందిరాలకు నోచుకోమా! మాట మాత్రం తెలిపితే పూర్ణ కుంభాలతో స్వాగతం చెప్పి పుర ప్రవేశం చేయించే వారమే! ఏమిటీ వటన."

(ఈ మాటలలో చిత్రాంగద వెళ్లిపోతుంది.)

"అది మా అదృష్ట సంఘటన."

"మా కన్నెల అపరాధం మన్నించండి."

"ఆతిధ్యమిచ్చే అవకాశం కలిగించండి."

"వ్రత దీక్షలో వున్నాం మహారాజా!"

"మా అభిమతం చెల్లించడం కూడ వ్రతంలో ఒక భాగమే అనుకోండి."

"అనుకోండి మహారాజా! ఆతిధ్యం పుచ్చుకొని పోదాం! అదే మనకు రక్ష."

"దయ చేయండి! దయ చేయండి!"

ఈ సన్నివేశం ఎస్. ఎస్. ఎ. పి. బేనర్ క్రింద సి. జగన్మోహన్‌రావు భారీఖర్చుతో నిర్మిస్తున్న పౌరాణిక చిత్రం "బభ్రువాహన" లోనిది.

అర్జునుడు, బభ్రువాహనుడు యుద్ధ రంగంలో ప్రగల్భాలు పలికిన ఈ దిగువ సీస పద్యం సముద్రాల రాఘవాచార్య వ్రాశారు. ఘంటసాల — మాధవపెద్ది పెద్ది కలిసి పాడిన ఈ పద్యం 9వ, తేదీని భరణీ స్టూడియోలో రికార్డు చేశారు. 10 నుండి 12 వరకు. అర్జునుడు — బభ్రువాహనునిగా రామారావు, చలంతో, చిత్రీకరించారు.

అ. "కదనమ్ములోన శంకరుని మెప్పించిన
హా! గాండీవి నెదిరింప గలవె నీవు —"

బ. "అడవి పందులను వేటాడు కిరాతుని
మెప్పించుట యొక గొప్పతనమె."

అ. "కాలకాయుని వాత కనబడి దనుజుల
కంటేసు నీ పరాక్రమము మనమె."

బ. "ఇలపై మనలేక జలధిలో దాగిన
భీరుల నోడ్చుట విక్రమంబె!"

అ. "సకల రాజ్య భీషణుడైన గాంగేయు
మరపింప జాలిన మగడవేమొ."

బ. "ముందుగా మొండి నపుంసకుని నిలబెట్టి
తాతను జంపుట దర్పమేమొ."

అ. "ఒడలు తెలియని పొగరున మిడిసి పడెదు
కోరి ఆపద కొని తెచ్చుకొనకు క్షుద్ర!"

బ. "బాలుని ప్రగల్భాలిక నవ్వసాచి
ఆలసింపక గాండీవ మందు కొమ్ము."

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, చలం, రేలంగి, కాంతారావు, ముక్కామల, పేకేటి, నాగర, అల్లు రామలింగయ్య, వర్ధియ సి. యస్. ఆర్. యస్. వరలక్ష్మి, రాజసులోచన మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి కథ — మాటలు — పాటలు దర్శకత్వం : సముద్రాల రాఘవాచార్య; సంగీతం : పామర్తి; ఛాయ — కమల్‌ఘోష్; నృత్యం నృత్యాలు: వెంపటి కృష్ణమూర్తి; కళ : శేఖర్, కూర్పు : హరినారాయణ, అసోసియేట్ దర్శకుడు : విజయా రావు. స్టూడియో: విజయా — వాహినీ; ప్రొడక్షన్ ఇన్‌ఛార్జి — యస్. చిట్టిబాబు; నిర్మాత : సి. జగన్మోహనరావు.

సి. ధర్మారావు ☆




మొదట్లో తెలుగు "కర్ణగం" చిత్రంలో ప్రధాన భూమికలు సావిత్రి, జమున వేస్తారను కున్నారు. ఇప్పుడు సావిత్రి ఆ వేషం చిన్నదని వేయదని దేవికను ఆ పాత్రకి నియమించారు. కారణం ఏదైనా కావచ్చును గాని పాత్ర చిన్నదవటం కాదు. ఆ పాత్ర ఎంతటిదో తమిళ చిత్రంలో కూడా నటించిన సావిత్రికి తెలియకుండా ఎలా వుంటుంది? అసలు సావిత్రి మానుకోవటానికి కారణం ఆ రెండవ వేషం తన మాట ప్రకారం వాసంతికి యివ్వకుండా జమునకు ఇవ్వటమే అని ఒక అనధికార వార్త చలామణీలో వుంది. ఇదెంత వరకు నిజమో తెలియదు. అవును మరి "మూగ మనసు"లో పరాకాష్ఠ నందుకున్న నటనకు ఇదీ ఉదాహరణ అంటూ బ్రహ్మాండంగా నటించింది సావిత్రి. ప్రజానీకం బ్రహ్మరథం పట్టింది జమునకు. ఇక సావిత్రికి ఒళ్ళు మండిందీ అంటే ఆశ్చర్యమేముంది?

* * *

సుమంగళి" చిత్రంలో నటించడానికి ఒప్పుకున్న ఎస్. వి. రంగారావు సగంలో ససేమిరా అవటం, అతని స్థానే గుమ్మడిని నియమించడం జరిగింది. రంగారావు ఇప్పట్లో కాదనటానికి కారణం హైదరాబాదు సారథిలో పని చేయుటం ఇష్టం లేక పోవడమే అని. అవును మరి. ఒక ప్రక్క మద్రాసు బహిరంగ సభల్లో విమర్శిస్తూ, మరొక ప్రక్క అదే స్టూడియోలో పనెలా చేస్తాడు? నలుగురూ దుమ్మెత్తి పోస్తారనే భయం లేక పోయినా, సి. వి. వి. ఆర్. ప్రసాద్ ముఖం చూడ్డానికి సంకోచం అయినా వుండాలి.

* * *

హైదరాబాదులో నవశక్తి వారు ఒక చిత్రం, హైదరాబాదు మూవీస్ వారు రెండో, మూడో చిత్రాలు తీసారు. వారి కది లాభసాటిగా కనిపించ లేదు కాబోలు, రెండు సంస్థలూ తరువాతి చిత్రాలు మద్రాసులోనే ప్రారంభించారు. మరెవ్వరూ సారథిలో తీద్దామనే ఉద్దేశ్యం చూపక పోవడం, స్వంతంగా చిత్రాలు తీసే ఉద్దేశ్యం—వై. ఆర్. కె. ప్రసాద్‌కి లేక పోవడం వలన స్టూడియో మూసివేత వరకు రావడం, అంతలో నాగేశ్వరరావు యే కారణంచేతనో తరలి వెళ్ళాడు. చతుర్విధోపాయాలలో యేవి ఉపయోగించాడో తెలియదు గాని ప్రభుత్వపు సహకారాన్ని చిత్ర పరిశ్రమకు సంపాదించి పెట్టాడు.

ఇక యాభై వేల సబ్సిడీ తన చిత్రాలకే వస్తుందని కాకిగోల యెందుకు? ఇప్పుడు నాగేశ్వరరావు నటిస్తున్న యే చిత్రానికీ పది లక్షలకు తక్కువ ఖర్చుకావటంలేదు. పదిలక్షలలో యాభై ఇరవయ్యో వంతు. చిత్రానికి నాగేశ్వరరావు యాభై వేలు తీసుకుంటున్నాడనుకుంటే అతని కొతం రెండువేల అయిదువందలు. ఈ మాత్రం దానికి ఇంత గొడవ పెట్టాలా? అది కూడా యెందుకు అతనికి అంటాలంటారేమో! ఇంత వ్యయ ప్రయాసలకు వోర్చి తరలి వెళ్లిన వానికి ఆ మాత్రం ఫలితం ఉంటే తప్పేమిటి?

ఏప్రిల్ 20వ తేదీన విజయా గార్డెన్స్‌లో తెలుగు ఫిలిం పరిశ్రమ (పిక్చర్‌లో ఆమాట ఇంకా తెలియలేదు!) సభ్యులు సమర్పించిన ఎస్. వి. రంగారావుపధిని వినతి పత్రంలో ఇలా ఉంది.

"శ్రీయుతులు నాగిరెడ్డి, రామారావులు హైదరాబాదుకు వచ్చేస్తే జరిగేదేమిటి" అని ప్రశ్నించారు. ఏమీ కాదు. చిత్ర పరిశ్రమకు గాని వారి శ్రామికులకు గాని ఇంత పిసర లోటుండదు. రామారావు గొప్పనటుడే. నాగిరెడ్డి చిత్ర పరిశ్రమకు నిర్మాతగా, స్టూడియో స్వంతదారునిగా ముఖ్యుడే. కాని వీరిద్దరూ మద్రాసు వదలినంత మాత్రాన అచట తెలుగు చిత్రపరిశ్రమ స్తంభించి పోతుందని, కళాకారులందరూ అన్నం లేకుండా మాడిపోతారని అనుకోవడం లేదా అటువంటి శ్రమకలిగించ ప్రయత్నించడం సరికాదు. ★

## ముఖ్యమంత్రి సహాయనిధి ఏర్పాటు!



ప్రధాని జాతీయ సహాయనిధి పద్ధతిలో భారతదేశంలోకెల్లా మొదటిసారి ఆంధ్రప్రదేశ్‌లో 'ముఖ్యమంత్రిసహాయనిధి'ఏర్పాటు చేయదలచినట్లు ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి 27 జూన్ ఉదయం శ్రీ ఎన్. టి. రామారావు సమర్పించిన లక్షరూపాయల చెక్కును స్వీకరించిన సందర్భంలో సూచించారు.

మానవ సేవా కార్యాలకై ముఖ్యమంత్రి తన ఇష్టం వచ్చినట్లు వినియోగించటానికని శ్రీ రామారావు జూన్ 27 ఉదయం 10.30 కి లక్షరూపాయల చెక్కును సమర్పించారు.

ఈ నిధి విజయవాడ అగ్ని ప్రమాదాలకు లోనయిన వారి సహాయానికి ఉపయోగపరచవచ్చునని తెలుస్తోంది. శ్రీ రామారావు ఇచ్చిన లక్ష; ఈ నిధికి 'బ్రహ్మాండమయిన బోణీ' అనుకుంటున్నారు చాలా మంది...

ఎన్. ఆర్. రాక : స్వాగతం !

# పర్యటనానంతరం ఆనందంగా తిరిగివచ్చిన

# అక్కినేనితో వెంటనే పదినిమిషాలు పాటు కబుర్లు : వీరాజీ

28 జూన్ రాత్రి మీనంబాక్కం విమానాశ్రయానికి, తన పర్యటనానంతరం దేశానికి ప్రఖ్యాత నటుడు అక్కినేని తిరిగి వస్తూఉంటే, ప్రేమతో స్వాగత మివ్వడానికి వచ్చిన వదుల వందల ప్రేక్షకుల సంగతే ముందు చెప్పాలి. విమానం 4 గంట లాలశ్య మవుతూందన్నా సాయంకాలం నుంచి గాఢంగా ఆకాశాన్నలుముకున్న మేఘాలు తప్ప మరెవ్వరూ తిరిగి పోలేదు. అందుకే పన్నెండున్నర గంటలకి అక్కినేని వచ్చినప్పుడు ఆనందం, ప్రేమ రెండూ ఉక్కిరి బిక్కిరి చేశాయి. సాటి, మేటి, తోటి నిర్మాతలు, దర్శకులు, నటులు, బంధువులూ, ఆప్తులూ అక్కినేనికి బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చారు. పూలమధ్య, ప్రేక్షకుల మధ్య ఉక్కిరి బిక్కిరి అయిన అక్కినేని నాగేశ్వరరావును "ఎంత ఆనందంగా ఉందిప్పుడు" అని నేను గట్టిగా అరిచినప్పుడు "థాంక్స్, థాంక్స్" అని పూలదండల వర్షాన్ని తప్పించుకుంటూ అతనన్న మాటల్లో బ్రహ్మానందం కనుపించింది.

వచ్చిన ప్రముఖులలో అమెరికా సమాచారశాఖ సీక్టింగ్ కల్చరల్ ఆఫీసర్ ఫ్రాన్సిస్ కవర్డ్, శ్రీ బి. ఎస్. ఆర్. కృష్ణ (తెలుగు చీఫ్ ఎడిటర్)లతోబాటు ఆప్తులు డి. మధుసూదనరావు, నాగయ్య, గుమ్మడి, ఆదుర్తి, ప్రత్యగాత్మ, కడారు నాగభూషణం, పి. పుల్లయ్య, కాంతారావు, జగ్గయ్య, జానకి, కృష్ణకుమారి, సావిత్రి, జెమినీ గణేశ్, సూర్యకాంతం, వాసంతి, రామినీడు, వి. వెంకటేశ్వర్లు, రాజేశ్వరరావు, మొ॥గు ఇంకా ఇంకా అనేకులు ఆప్తులు, మిత్రులూ ఎందరో వున్నారు !

* * *

మర్నాడు 29వతేదీ ఉదయమే, ఉడ్‌లాండ్స్‌లో అక్కినేనిని. "ఆంధ్ర సచిత్రవార పత్రిక, అభివందిస్తూ పల్కరించినప్పుడు అందంగా, ఆనందంగా అగుపించాడతడు! ఆ మాటే నేనుచెప్పాను. "ఇంకోరెండు రోజుల్లో ఇంకా అందంగా అగుపిస్తాన" న్నాడు హాయిగా నవ్వుతూ శ్రీ అక్కినేని.

"అసలు మలయాలోనే మన తెనుగు, తమిళ సోదరుల ఉక్కిరిబిక్కిరిగా కార్యక్రమాలు కొంత ఎక్కువ శ్రమనిచ్చాయి', అనికూడా అంటూ లోపలికి వెళ్ళి స్నానంచేసి, పదహారణాల తెనుగు వేషంలో తిరిగివస్తూనే, "ఈ పర్యటనలో ఎక్కడా "హోమ్ సిక్‌నెస్" (ఇంటి బెంగ) ఫీలవలేదుకదా? అని అడిగితే, "లేదు నేను ఒక సంస్కృతి ప్రతినిధిగా, ఒక దేశంనించి ఆప్యాయంగా, వాళ్ళ ఆహ్వానాన్ని తీసుకుని వెళ్ళాను గనుక వ్యక్తిగాకంటే ఎక్కువ బాధ్యతను ఫీలయ్యాను. అన్నిచోట్ల గల మన



"మీ స్వాగతానికి థాంక్స్ !"

సంస్కార సంస్కృతులపట్ల కుతూహలం గౌరవం, ఆప్యాయత నన్ను పరవశుణ్ణి చేస్తూ వచ్చాయి." అమెరికానుంచి ఫ్రాన్సుకి వెళ్ళినా ఫ్రాన్సునుంచి జర్మనీకి వచ్చినా ఇండస్ట్రీకి సంబంధించినంతవరకూ పోలికలగుపించాయి" అన్నారు.

"నాలుగు పాటలు బరువు" మాత్రం తగ్గి కళాకారునిగా పర్యటనలో ఎన్నో కొత్త విషయాలు తెల్సుకుని వచ్చిన శ్రీ అక్కినేని "అమెరికాలో ఒక అగ్రికల్చరల్ ఫారమ్‌కి వెళ్ళాను. వాళ్ళలో మధ్య తరగతి కుటుంబీకుల జీవన పంథాను చూడాలనే కుతూహలంతో కూడా ఉన్నాను."అప్రోచ్"లోఅంటే దృక్పథంలో మన జీవనానికి వాళ్ళ విధానానికి పోలికలున్నాయి. సదుపాయాలు వాళ్ళకే ఎక్కువ ఉన్నాయి" అన్నారు.

పలువురు పెద్దలు, మిత్రులు, ప్రముఖులు వస్తున్నారు. ప్రేమతో పల్కరిస్తున్నారు. ఫోను మ్రోగుతూనే ఉంది. ఆ ముందు రాత్రి మూడు గంటలదాకా ఉక్కిరిబిక్కిరిగా ప్రేమాభిమానాలు పరిపేశాయి! పరిపేస్తున్నాయి. అదీ నే నభివందించిన వేళ.

ఆ సమయంలో నేను పలకరించాను. మాట్లాడుతున్నాను. ఈ పంచె, లాల్చీ లలో మారుపైన తెనుదనంగల తెనుగు నటుణ్ని "అక్కడ ఇవి మీరు వేసుకున్నప్పుడు ప్రజలు చాలా కుతూహలం చూపించారా?అని అడిగాను."నిజంగావాళ్ళకిమనకట్టుబొట్టు తీరూ తెన్నూ అంటే చాలా ఇష్టం... కాని వీటిని చాకలికి వేసి ఉతికించుకోడం లోగల ఇబ్బంది వలన నేను ఎక్కువగా పంచె లాల్చీ వేసుకోలేక పోయాను" అన్నాడాయన.

"అక్కడి విశ్వ విద్యాలయాలలో లలిత కళలకు వారు ఇస్తున్న శిక్షణ ప్రోత్సాహంలన్నీ చాలాప్రభావితుణ్ణి చేశాయంటూంటే"మరి స్టేజి, సినిమా ధాటికి తట్టుకుని ఉంటున్నదికదా?" అని అడిగాను. "నిజమే. టెలివిజన్ సినిమాకి యిస్తున్నంత పోటీ నాటకాలు ఇవ్వకపోయినా వాటి ధాటి స్థాయి బాగా ఉన్నాయి" అన్నాడు శ్రీ అక్కినేని.

"మిమ్మల్ని ఎక్కువగా వాళ్ళు మన సినిమాల విషయంలో కుతూహలజనకంగా అడిగిన ప్రశ్నలేమిటి?" "అంటే "ముద్దు"గురించి అన్నాడు శ్రీ అక్కినేని

"తెరమీద మన వాళ్ళు ముద్దులనెందుకు ఒప్పి (పెట్టు) కోరు?" అనే ప్రశ్నకు నాగేశ్వరరావు "మేము చాలా గౌరవంగా, మితంగా("ముద్దు" గా అన్నమాట) వాడుకుంటాం. పవిత్రంగాను ఇష్టంగాను భావించేవన్నీ దాచుకోడం; అరుదుగా వాడుకోడం చేస్తాం కదా" అంటూ నమ్మకమైన సంస్కారయుతమైన జవాబులు చెప్తూ వచ్చేవారట. అమెరికాలో కూడా "మనవాళ్ళు ఎన్నో మంది ముఖ్యంగా విద్యార్థులు నన్ను పల్కరించడమేగాక వాళ్ళ (అమెరికన్‌ల) ఆప్యాయతకూడా "హాయిగా" గా మనవాళ్ళ మధ్యనున్నట్లు అనిపింపజేసింది. "అమెరికన్ పంచుయాలిటి" నన్నుముగ్ధుణ్ణి చేసింది."

నిజంగా నేను; ఒక సంస్కృతి ప్రతినిధిగా అమెరికా ఆహ్వానం మీద తెనుగు ఫిలిమ్ పరిశ్రమనించి సుదీర్ఘ పర్యటన అనంతరం వచ్చిన శ్రీ అక్కినేనిని (పాఠకుల తరపున కూడా) అభివందించి, వెంటనే హడావుడిలో స్వాగతం పలక వెళ్ళినపుడు ఇంతకన్నా వేరే ఏం అడుగుతాము? కుశల ప్రశ్నల మధ్య పలువురి ప్రముఖుల కాలాన్ని తీసుకుంటున్నాము అనే గాక, ఇవతల "పత్రిక" పూర్తైపోతున్న తరుణంలోగనుక విపులంగా విశేషాలు "మా పాఠకులకు మళ్ళీ అందిస్తాము"నిక్షేమంగా వెళ్ళి; లాభంగా క్షేమంగా మరింత వచ్చిన అక్కినేనిని అడుగుతూ "పరిగెత్తుకు" వచ్చి రాశానిది.

నిన్న రాత్రి (28 వ తేది) ఇవాళ ఉదయం (29 వ తేదీ) కూడ శ్రీ నాగేశ్వరరావును చూశాకా "తానొక బాధ్యతను సంతృప్తికరంగా నిర్వర్తించాననే తృప్తి మన దేశం పట్ల విదేశాల్లో గల ఆసక్తి గౌరవాలు కళాకారుని గా చూడగలిగివచ్చాననే సంతృప్తి అగుపించాయి. అతన్ని ప్రేక్షకులు "నటుని" గా చూసి ఆనందిస్తారు. అలాగే ప్రేమించాలి.

అలాగే మేము ఈ కుశలప్రశ్నలనువేసి "అక్కినేని అందంగా ఆనందంగా తిరిగిస్వదేశానికి వచ్చాడని" "పాఠకులకు ఇంత అత్యవసరంగా అందిస్తున్నాము." ప్రఖ్యాత నటుడు అక్కినేని తన పర్యటన గురించి ఒక పుస్తకం రాయదల్చుకుంటున్నానని చెప్పారు. శుభం!



# యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా

**(1963 నాటి యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా చట్టం ప్రకారం స్థాపించబడినది)**




# 1964 జూలై 1 నుంచి యూనిట్ల అమ్మకం ప్రారంభం

ఒక్కొక్క యూనిట్ ప్రాథమిక విలువ రు. 10/- లు. పది యూనిట్లనుగాని, పది యూనిట్లను హెచ్చించుకుంటూ పోతే రాగల సంఖ్యను మేరకుగాని యూనిట్‌లను మీరు ఖరీదు చేయవచ్చు. 1964 జూలై 1 వ తేదీ నుంచి 31 వ తేదీవరకు యీ యూనిట్లు అమ్మబడగలవు.

యూనిట్‌లలో పెట్టుబడి పెట్టడంవల్ల మీకు ఈ క్రింది లాభాలు చేకూరగలవు:

* నమ్మకమైన ఆదాయం
* పెట్టుబడికి పూర్తి రక్షణ
* పెట్టుబడి వృద్ధికి అవకాశం
* ముఖ్యమైన పన్నుల మినహాయింపులు

**క్రింద పేర్కొనబడిన బ్యాంకులకు వివిధప్రాంతాలలో వున్న ఆఫీసులలోను యూనిట్‌లు అమ్మబడగలవు:**

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ మైసూరు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ బికనీర్ & జైపూర్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండోర్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ తిరువాన్‌కూర్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ సౌరాష్ట్ర, స్టేట్ బ్యాంక్ ఆఫ్ పాటియాలా, బ్యాంక్ ఆఫ్ ఇండియా, సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, పంజాబ్ నేషనల్ బ్యాంక్, ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంక్, ఇండియన్ బ్యాంక్, యునైటెడ్ కమ్మర్షియల్ బ్యాంక్, కెనరా బ్యాంక్, బ్యాంక్ ఆఫ్ బరోడా, నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్, సిండికేట్ బ్యాంక్, దేవకరన్ నాన్‌జీ బ్యాంకింగ్ కం., యునైటెడ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఆంధ్రా బ్యాంక్, అలహాబాద్ బ్యాంక్, చార్టర్డ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, బ్యాంక్ ఆఫ్ బెహార్, న్యూ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఫస్ట్ నేషనల్‌సిటీ బ్యాంక్, మెర్కంటైల్ బ్యాంక్, హాంగ్‌కాంగ్ అండ్ షాంగ్‌హై బ్యాంక్, కృష్ణరామ్ బలదేవ్ బ్యాంక్, తంజావూర్ పర్మనెంట్ బ్యాంక్, బ్యాంక్ ఆఫ్ రాజస్థాన్, లక్ష్మీ కమ్మర్షియల్ బ్యాంక్, హిందూస్థాన్ మెర్కంటైల్ బ్యాంక్, బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర, యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, నెదర్లెండ్స్ ట్రేడింగ్ సొసైటీ, ఓరియంటల్ బ్యాంక్ ఆఫ్ కామర్స్, మరియు బ్రిటిష్ బ్యాంక్ ఆఫ్ మిడిల్ ఈస్ట్.

ఈ క్రింది నగరాలలో స్టాక్ ఎక్స్ఛేంజీలలో రిజిష్టరుకాబడివున్న షేర్ బ్రోకర్లు కూడా యూనిట్‌లను అమ్మగలరు: అహమ్మదాబాద్, బెంగుళూరు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, హైదరాబాద్ ఇండోర్, మద్రాసు.

## యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా,

**పి. బి. 2000, బొంబాయి-1.**

## సురక్షితమైన పెట్టుబడిద్వారా సొమ్ము వృద్ధిచేసుకొనే క్రొత్త విధానం

DA 64/121

నిమిత్తం నాకు లిఖితపూర్వకంగా ఇచ్చి ఉన్న ప్రోగ్రాం నిర్లక్ష్యంచేసి నాకు స్టూడియో సౌకర్యాలు నిరాకరించారు. తమ వ్యాపారాభివృద్ధికోసం తమ అనుకూలమయిన ఏర్పాట్లు వారు చేసుకోవటం తప్పు అని నేనుగాని మరెవరుగానీ అనరు. కానీ ఏ పరిస్థితులలో నేను హైదరాబాద్‌నుంచి మద్రాసుకు మళ్ళా సంసారంతో తరలి పోవలసి వచ్చిందో పూర్తిగా తెలిసి కూడా ఆయన "నా వ్యాపార అవసరాల నిమిత్తం" మద్రాసుకు వెళ్ళిపోయానని నిందించడం శ్రీ ప్రసాద్ గారివంటి పెద్దలకు తగదు.

1962లో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు హైదరాబాదు తరలి వచ్చి వారి షూటింగు కార్యక్రమాలు ప్రారంభించినది మొదలు ఆయన విదేశయాత్రకు వెళ్ళేదాకా, ఆయన నటించని ఏ ఒక్క చిత్రానికి వారు స్టూడియో సౌకర్యాలు కలుగజేసిందీ విశద పరుస్తారా? ఇప్పుడు షూటింగు జరుపుతున్న సంస్థలు, శ్రీ నాగేశ్వరరావు దేశంలో లేని కారణంగా వారు స్టూడియో ఖాళీగా ఉంచడమెందుకుని వారికి అనుకూలమైన పద్ధతిలో షూటింగు చేసుకునే రెండు సంస్థలను దగ్గరకు తీసినది వాస్తవం కాదా? శ్రీ నాగేశ్వరరావు విదేశములనుండి తిరిగివచ్చిన తరువాత ఆయన అభిమానించి పనిజేసే కంపెనీల కార్యక్రమాలు మొదలయిన తరువాత ఇతర నిర్మాతలకు శ్రీ ప్రసాద్‌గారు స్టూడియోలో చోటివ్వగలరా? ఈ పరిస్థితులలో మేము — "ఒక అగ్ర నటుడూ, ఆయన అభిమానించిన నలుగురైదుగురు నిర్మాతలకు తప్ప మాకు చిత్రం నిర్మించే అవకాశం

## ఉత్తరాలు

3 వ పేజీ తరువాయి

ఆ స్టూడియోలో లేదు" అని అనడం సమంజసము కాదా?

ఆంధ్ర ప్రభుత్వ వైఖరిని సద్వినియోగం చేసుకోవాలనీ, దానినుండి వేరుపడి పరస్పరం నిందించుకొనడం ఎవరికీ శ్రేయస్కరంకాదని సెలవిచ్చారు గాని ఎవరు ఎవరిని వేరు చేశారో శ్రీ ప్రసాద్‌గారు ఎందుకు చెప్పరు? ఆంధ్ర ప్రభుత్వాన్ని అభినందించేందుకు ఆయనా, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, ఆయన కంపెనీలు ఒక సంఘాన్ని వేశారే, అందులో తొలినుంచీ హైదరాబాద్‌లో నిర్మాణం సాగించిన నన్ను ఎవరు వేరుచేశారో చెప్పరేం? నా వ్యాపార అవసరాల నిమిత్తం నేను ఈ సంఘమునుండి వేరు పడ్డాననికూడా వాదించడానికి శ్రీ ప్రసాద్‌గారు సాహసిస్తారా?

మరిన్ని సౌకర్యాలు కలిగించమని ప్రభుత్వాన్ని మనం కోరాలని శ్రీ ప్రసాద్‌గారు చెప్పారు. బాగుంది. నేను 1962లో ఒక కార్యక్రమాన్ని విజ్ఞాపనగా ప్రభుత్వానికి సమర్పించానని వారికి తెలుసు. హైదరాబాదులో చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి అందులో నేను చేసిన సూచనల సంగతి వారికి తెలుసు. అయినా శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, ఆయన కంపెనీలు ప్రభుత్వానికి మహజర్లు పెట్టేటప్పుడు గాని, అభినందించేటప్పుడుగానీ వాళ్ళలో కొత్తగా కలిసిన శ్రీ ప్రసాద్‌గారికి పాత విషయాలు గుర్తుకు రావేలేదు. వేరు పడడం శ్రేయస్కరం కాదని ఇప్పుడు హెచ్చరిక చేస్తున్నారుగానీ, అధిక సంఖ్యాకులైన పరిశ్రమలోని ప్రముఖుల్ని ఎందుకు వారంతా ఆదిలో వేరు చేశారో చెప్పటంలేదు.

ఒక అగ్రనటుడి సంస్థను మెప్పించడంకోసం స్టూడియోవారు నాకు ఇచ్చిన కాల్‌షీట్లను నిరాకరించినందువల్లనే నేను హైదరాబాద్ విడిచి మద్రాసు రావలసి వచ్చిందిగాని మరేకారణం లేదని శ్రీ సి. వి. ఆర్ ప్రసాద్‌గారు ఇప్పటికైనా ఒప్పుకుంటారని ఆశిస్తాను. ఆయన మరచి పోయిన విషయాలు, మరుగుపరచిన సత్యాలూ ఇంకా ఎన్నో ఉన్నాయి. అయినా గతాన్ని తవ్వుకొనడం కాదు మన ఆశయం. ఆంధ్ర రాజధానిలో తెలుగు చలనచిత్ర పరిశ్రమ మూడు పువ్వులూ, ఆరు కాయలూ వేసి ఫలించాలి. అయితే ఎవరో ఒక ప్రముఖ నటుడు తన అవసరాలని ఆంధ్రాభిమానం అంటూ తన వ్యాపారాభివృద్ధే ఆంధ్ర చలన చిత్రాభ్యుదయమని నమ్మిస్తున్నంత కాలం ఆ ప్రచారంలోపడి వాస్తవ సమస్యలను ప్రజలు, ప్రభుత్వం గుర్తించనంత కాలం, ఆంధ్ర రాజధానిలో చలనచిత్ర పరిశ్రమ సుస్థిరంగా వేళ్ళూనలేదు. వ్యక్తుల స్వార్థంకన్నా, కీర్తికాంక్షకన్నా, సమిష్టి ప్రయోజనాలూ, సమగ్ర శ్రేయస్సూ దృష్టిలో పెట్టుకొనడం మంచిదని మనవి చేస్తున్నాను.

పి. గంగాధరరావు

చిత్రనిర్మాత—హైదరాబాద్ మూవీస్,




Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street,
Madras-1. Phone: 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.

